జగత్పావన పుణ్యాము

యగు

శ్రీఅరవిందార్పణము

# విషయ సూచిక

వి ష య సూ చి క



# కేనోపనిషత్తు





# అపూర్వ పద నిఘంటు

మూల గ్రంథములందు వాడబడిన కొన్ని ముఖ్యఆంగ్ల పదములకు తెనుగు పర్యాయపదముల పట్టిక. (ఇవి తాత్కాలికముగ నుపయోగింప బడినవి.)

Intuition
Knowledge by identity: తాదాత్మ్యవిజ్ఞానము.

Transformation: పరివర్తనము.

Evolution: పరిణామము.

Involve: అంతర్వ్యాహృతము; అంతర్విలీనము.

Supermind: పరమనస్సు; అధ్యాత్మమనస్సు; విజ్ఞానము; సత్యం ఋతం బృహత్.

Overmind: అతిమనస్సు.

Inspired: దైవప్రేరితము.

Subconscience: అధశ్చేతన.

Inconscience: నిశ్చేతన.

## అపూర్వ పద నిఘంటు

Subliminal conscience: అర్ధప్రకాశ చేతన.

Super conscience: పరచేతన.

Aspiration: అభీప్స.

Cognitive: గ్రాహ్యకము.

Synthesis: సమాహితత్వము; సమన్వయము.

Subjective age: అంతఃకరణప్రాధాన్య యుగము.

Mental subjectivisim: మానసిక ఆత్మీయత.

Sentiment: భావసంకల్పము.

Simple confederacy: అనిబద్ధ సమాఖ్య; సులభ కట్టడి సముదాయము.

Looser World union: కుదుటబడని ప్రపంచ సమాజము.

Federal System: సంయుక్త విధానము.

Looser confederacy: కట్టుబడని పరిసంఘము

Federal order: పరిసంఘము.

# సవరణ పట్టిక

| పేజి: | పంక్తి: | తప్పు: | ఒప్పు: |
|---|---|---|---|
| 26 | 10 | ప్రిగాడా | ప్రగాఢా |
| 27 | 2 | ధీక్షిత | దక్షుత |
| 29 | 4 | నంటియుండు, | నంటియుండు: |
| 31 | 2 | ములను | ములును |
| 43 | 8 | పాపమను | పాపమును |
| 53 | 1 | అధచ్ఛేతన | అధచ్చేతన |
| ,, | 2 | నిశ్ఛేతన | నిశ్చేతన |
| 60 | 2 | ఈ ప్రకాశము | ఈ ప్రకాశమును |
| 76 | 11 | నసింప | నశింప |
| 93 | 2 | నూక్త | సూక్త |
| 112 | 8 | దివ్వేచ్ఛ | దివ్యేచ్ఛ |
| 118 | 5 | మాహా | మహా |
| ,, | 6 | ఇల | ఇళ |

# సవరణ పట్టిక

| | | | |
|---|---|---|---|
| ,, | 8 | సారము | సరము |
| 125 | 9 | సదత్తులు | సదసత్తులు |
| 135 | 11 | ప్రభోద | ప్రబోధ |
| 138 | 5 | శరీర | ‘‘శరీర |
| 139 | 12 | ప్రిభోద | ప్రిబోధ |
| 152 | 9 | వాడును | వాడను |
| ,, | ,, | పూర్వ్వాడును | పూర్వ్వాడను |
| ,, | 10 | వాడును | వాడను |
| 155 | 4 | లమయి | లమయ్యి |
| 233 | 12 | మింకూడదా | మింపకూడదా. |
| 236 | 5 | స్త్రబత | స్త్రబతల |
| 246 | 10 | సత్యవ | నత్యవ |
| అక్కడక్కడ: | | తైత్తిరేయ | తైత్తిరీయ |
| | ,, | ఐతేర్రియ | ఐతరేయ |



# శ్రీ అరవిందుల నిజతత్త్వ స్వరూపమును సూచించు తొలిపలుకు

# తొలి పలుకు

## శ్రీ అరవిందుల ప్రశంస

జగత్పావన పుణ్యమూర్తి యైన శ్రీ అరవిందుల నీకాలమున మన యాంధ్ర దేశముననుభరతఖండ మందంతటనేగాక ఖండాంతర దేశములయందును గల జిజ్ఞాసువులలో నధిక సంఖ్యాకులు విని యుందురనుట నిశ్చయము. కాని వీరియందా యుగపురుషుని దర్శించినవారు కొలది మంది మాత్రమే యన సందియము లేదు.

మఱి నా యతీతగుణాఢ్యుని తత్త్వత:—
ఆములాగ్రము- తెలిసికొనిన వారత్యంత
స్వల్ప సంఖ్యాలే యన చిత్రమేమియు లేదు.
"తత్పరమాత్మ విష్ణు నితరుల్దర్శింపగా
నేర్తురే," యన్న మహాకవి వాక్యము నా
టికి సత్యమైనది. సమగ్రముగ నొకటి
తెలిసికొనవలెనన్న దానితో నైక్యత,
కేవల తాదాత్మ్యము, తప్పనిసరిగ కలుగ
వలెను. శ్రీఅరవిందులను మహాకవియని
కొందఱును, తత్త్వవేత్తయని కొందఱును,
యోగియని కొందఱును, కొందఱు జీవ
న్ముక్తులనియు, మఱికొందఱు నీరుకప్పిన

నిప్పుబోలిన విప్లవకారులనియు, వారివారి యిచ్ఛమెయి పలు పలువిధములుగ నూహించెదరు. ఆనాటి వంగదేశీయ విద్వత్ సంపన్నుల మర్యాదమేరకు నచ్చవు పాశ్చాత్య సంస్కృతియందు సుశిక్షితుడై దేశమందలి యాంగ్లపాలక వర్గమందత్యున్నత పదవి నలంకరింపగలడు తన తనయుండని యాశించిన తండ్రిచే కడు బాల్యముననే ఇంగ్లాండునకు పంపబడి పండ్రెండు వత్సరములపాటు విద్య నభ్యసించి శిష్టభాషలందు విశిష్టప్రౌఢిమయు ఆంగ్లమున మహత్వ కవిత్వ పటుత్వ సంపదను గాంచు

టయు, ఆవెనుక మఱి పండ్రెండు వత్సర
ములు బరోడా రాష్ట్రమం దధ్యాపకులుగ
నుపవిష్టులయి స్వయం శిక్షణతో సంస్కృ
తము నందపార పాండిత్యమును నర్మదా
తీర వాసులాదిగాగల పెక్కండ్రు మహాను
భావుల సమాగమన పరిచయ ప్రభావ
మున హైందవ ఆర్య సంస్కృతియం దను
పమ విజ్ఞతం బడయుటయు, ఆపయి
మాతృరాష్ట్రము జేరి జాతీయోద్యమము
పట్ల భారతీయుల మేల్కొలుప తీవ్రవాది
పక్షమున యమోఘకృషి సల్ప కాల
వశాత్తు ఘోర నేరారోపణకు గురియై

సంవత్సరముకు పైబడిన విచారణ కాల
మందు నేకాంత కారావాస ప్రాప్తినొంది
అందు భగవదాదేశమున నిరంతర యోగా
రూఢులయి వాసుదేవ సాక్షాత్కారంబు
గాంచి విచారణాంతమున నిర్దోషుండని
విడిపింపబడుటయు, ఆవల స్వల్పకాలమునకే
రాజకీయ కార్యరంగమును వదలి మారు
మూలయు పరాసువారి యధీనమైనదియు
నైన పుదుచ్చేరియందు దైవ యోగంబున
యనతికాలం బజ్ఞాతవాసం బొనర్చుటయు,
ఆమీాద 'రిచ్చర్డు' దంపతులచే ప్రేరితులయి
'ఆర్య' యను తత్త్వవైజ్ఞానిక ఆంగ్ల మాస

# తొలి పలుకు

పత్రికను నడపుచు నేడవ సంవత్సరమున దానిని ఆపి, తమ లక్ష్యసిద్ధికయి యంతర్వ్యా ర్తితమైన కృషియందతి నిమగ్నులయి తమ మార్గావలంబులైన యంతేవాసులతో క్రమాభివృద్ధిని జెందుచున్న యాశ్రమ నిర్వహణ కార్యమునకు అప్పటినుండి శ్రీమాత యని పిలువబడు మీరాదేవిని నియోగించి పాలుకు మూడు పర్యాయము లొసగు దర్శన సమయమందు తప్ప నితర కాలమందంతయు వివిక్తసేవివైు మొదలు మొదలు నిర్విరామముగను రాను రాను కదాచిత్తుగ నుల్లేఖించి యొసంగిన సందేశ

నిచయంబు వలన నైనదితప్ప మరేబాహ్య సంబంధము ప్రపంచముతో లేకయుండుట యు,నీయూహల కాధారమగు నెడమియ్య గలగినవి కదా! కాని, నిజమును తెలిసి కొనుట కేకైక సాధనమైన తాదాత్మ్య సిద్ధి మనలో నెవరికి కలదని చెప్పగలము. ఈ సాధనము లేనపుడు శ్రీవారి రచనలే యిందు తోడ్పడగలవు. ఈ రచన లపార ములు అమోఘములు. నామ రూపాత్మక మగు నీవిశ్వమందు బాహ్యదృష్టి కగోచర ములయి యంతర్విలీనంబులై యున్న గుహ్య సంశ్లిష్ట విశేష విషయముల జిత్రిం

చు మహాకావ్యములును, చేతనా చేతన యుతమును వ్యక్తి సమష్టిగతము నగు విశ్వమునకును దాని మూలమునకును గల సంబంధమును తేటపఱచు తత్త్వ దర్శన ములును, భగవదావిష్కార కేంద్రమైన జగత్తునందు వ్యక్తి సంఘము జాతి ఇవన్ని యు నిర్దిష్ట సిద్ధిని బడయ సహకారులగు యోగ దర్శనములును, వివిధ సాధక జనం బ్బుల నయ్యా యెడ నెదుర్కొను క్లిష్ట సమ స్యల పరిష్కరణార్థ ముల్లేఖింపబడిన లేఖ లును గలవు. సర్వతోముఖంబయిన యీ రచనలను పాఠకులు తమ తమ దృక్పథ

ముల నుండియే అన్వయించుట సహజము. దాని చేగలుగు ప్రమాదము తప్పునది కాదు. తమ కృషియందలి లక్ష్యమును దానిని సాధించు విధానమును వీనిని తామెల్లు హైందవ సాంప్రదాయమగు ప్రాచీన వేదాంత దృక్పథముతో సమర్థించినది స్ఫుటముగ నార్య నాల్గవ సంపుటి తుది సంచికలో 'నార్య నాల్గవర్షమను' శీర్షిక క్రింద శ్రీఅరవిందులు వ్రాసియున్నారు. మనకీ సందర్భమున యది మిక్కిలి సహకారి కాగలదు. కాన దాని యనువాదము నీదిగువ జతపఱచినాము. అందు సంక్షేప

ముగ వ్రాయబడిన విషయములను విపులము జేయుటకు సందర్భానుసారముగ మాతృగ్రంథములనుండి ఆయా విషయములకు సంబంధించిన భాగముల కనువాదములును, అవసరమని తోచినచో సమన్వయము చేసి పొందికపఱచు వాక్యములను చేర్చినాము:—

## ఆ ర్య

శ్రీఅరవిందులు 1914–వ సంవత్సరమందు తమ జన్మదినమగు ఆగష్టు 15–వ తేదీన "ఆర్య" యను పత్రికను ప్రారంభించుచూ సృష్ట్యానుబంధంబు లయిన మూల

ఆర్య

సమస్యల సాకల్యముగ పరిశీలించుటయును ప్రాక్పశ్చిమములందలి మానవజాతియొక్క వివిధ మత సాంప్రదాయములను సమరస మొనర్చు నపార సమన్వయ జ్ఞాన నిరూపణమును తమ యుద్దేశ ద్వయంబనియు, తత్త్వజిజ్ఞాసపరమగు సమన్వయ చింతనములను, ప్రాచీన శ్రుతుల యను వాద వ్యాఖ్యలను, అంతశ్శిక్షణ యాత్మవికాసోపకరణములయిన యాచరణవిధానముల, నీ పత్రిక ప్రచురించుననియు సూక్ష్మముగ సూచించి మొదటి సంవత్సరమునందు దివ్యజీవనము, యోగ సమన్వయములకు

తోడు, వేదరహస్యము పర్చితీసిన సూక్తాను
వాదము ఈశ కేనోపనిషద్భాష్యములను
ప్రాచీనశ్రుతుల యనువాద వ్యాఖ్యలును,
రెండవ సంవత్సరమున వీనికితోడు
'మానవ ఐక్యతాశయము'ను ప్రారంభిం
చితి. మూడవ సంవత్సరమున వేదమందలి
సాంకేతిక భావములను ద్రుఢపఱచుటకు
ఋగ్వేదమందలి వృత్రగాధ పరిశీలన
మెంతేని యవసరమయ్యెను వేదరహస్య
మను వ్యాసముల నాపి యితరావశ్యక
విషయములగు 'గీతావ్యాసములకు' మానవ
సంఘాభ్యుదయ తత్త్వమున' కెడ మొసం

గిరి. తైత్తిరీయోపనిషత్తుదనువాదవ్యాఖ్యలు కూడ ముఖ్యమైనవే యైనను ఆ యుపనిషత్తు కడు విస్తారమయినదగుటచే నాల్గవ సంవత్సరమందుకూడ దాని కెడమియ్యజాలరైరి. నాల్గవ సంవత్సరాంతమునకు దివ్యజీవనలో స్వల్పభాగము తప్ప మిగత యంతయు పూర్తి జేసిరి. గీతావ్యాసముల యందొకఖండము పూర్తి ఆయెను. మానవైక్యతాశయమును మానవసంఘాభ్యుదయ తత్త్వమును ముగించిరి. అట్లే యోగ సమన్వయమందు దాదాపు త్రిమార్గ హఠ రాజయోగ వివ

రణములను పూర్తిజేసిరి. ఈ రీతి నాల్గు సం
వత్సరములకు పైబడినకాలము పత్రిక నం
తయు వరుసగదివ్యజీవన, వేదరహస్యము,
ఋగ్వేద సూక్తానువాదము, ఈశకేన యుప
నిషద్భాష్యములు, గీతా వ్యాసములు,
యోగ సమన్వయము, మానవసంఘవికాస
తత్త్వము, మానవ ఐక్యతాశయములను
సుదీర్ఘ వ్యాసపరంపరా పుంజములతో
పూరించుటచే పాఠకుల కీ రచనలయందలి
వాస్తవోద్దేశ్య మేమైనది సుబోధక మగు
టకు తామిందుపన్నిన వ్యూహము ముగి
యుతరి నీ వివరణమును వ్రాయ నవసర

మేర్పడినది. సర్వతోముఖమయిన యీ అమోఘ కృషి కడు దీర్ఘమగు నాల్గు వత్సరముల కాలము వరుస క్రమముగ జేయుటచే కొందఱు తత్త్వవిషయముల నెల్లరకు సుబోధకముగ వ్రాయ గడంగిరనియు కొందఱు నిర్దిష్టరూపముదాల్చిన మత సాంప్రదాయమును గట్టిగా ప్రచురింప దొడగిరనియు యూహింప నవకాశముండె. దీనిని తొలగించి నిజ మెఱుకపఱచుటకై ఆర్య నాల్గవ వత్సరాంతమున నీ వ్యాసమునందు నీగ్రంథముల నన్నిటిని సంక్షేప సమీక్షను గావించిరి.

# ఆర్య నాస్తిక వర్షము
# ఉద్దేశ్యము - లక్ష్యము

"తత్త్వ విషయములను గూర్చిన తాత్కాలిక వర్తమానములను తాత్కాలిక భావములను జనానురంజికముగ ప్రచురించు నుద్దేశము మాకెన్నడును లేదు. హిందూదేశమందలి కొన్ని తత్త్వవైజ్ఞానిక-మత-పత్రికలయందునుండి జాలె ధ్రువపడుచు వ్యాపకము మాత్రము జేయవలసినట్టియు నిర్దిష్ట రూపమును దాల్చినట్టి యొకానొక తత్త్వదర్శనము లేక మత

ఉద్దేశ్యము లక్ష్యము

సాంప్రదాయము యొక్క పునరుద్ఘాటనయు మాయుద్దేశము కాదు.

"మనల నెదుర్కొనుచున్న నవయుగమున కుపకరింపగల భావములను రూపొందించు నట్టి సమన్వయాత్మక తత్త్వచింతనయే మాయుద్దేశము. జాతిని నూత్న జీవనమునకు కొనిపోగల మహత్తర జీవన పరివర్తనమువైపు మానవత్వము పురోగమించుచున్నదను భావముతో ప్రారంభించి—చింతనాపరులగు మానవులు గల దేశములన్నిటి యందీ భావము ఆ ఆశయ మిప్పుడు పలురూపములతో నున్నది—

ఆయుద్యమ యత్నములందు జాతికి నెఱుక
పఱచి దారి చూపించు ఆధ్యాత్మిక,
ధార్మిక, మఱియు నితర సత్యాన్వేషణమే
మేము లక్ష్యముగా గైకొంటిమి. ఆ
ప్రయత్నమునకు పునాది కాగల ఆధ్యాత్మి
కానుభవము ప్రాయిక సత్యములు మా
కదివఱకే లభించియున్నవి. అది లేనిచో
నీయత్నము చేయు నధికారమే యుండదు.
కాని వానియొక్క, వాని ఫలితార్థములు
వాని సారాంశముల యొక్క సమగ్ర
నిర్వచనములను నిరూపించవలసి యుండె.
దీని కొఱకు నిర్విరామ చింతనయు పలు

మార్గముల యున్నతమును సూక్ష్మమును మఱియు నతి శ్రమదాయకమగు చింతన చేయవలసివచ్చినది."

అధ్యాయానుక్రమముగ పత్రికయందు ప్రచురింపబడిన పీ యుగ్రిందములు. అందొకటి—యోగ సమన్వయము నందలి ఉత్తర భాగము—ఆత్మ సంసిద్ధి యోగము యేడవ సంవత్సరమున పత్రిక నాపువఱకు ఇంకను ముగియలేదు. ఆఱవ సంవత్సరాంతమునకు గీతావ్యాసము లందలి ద్వితీయ ఖండము ముగిసినది. కావున ఆర్య యంతయు మొత్తముపయిన నీ గ్రంథరచ

నలతో సమాప్తమయినది. తాత్కాలిక తత్త్వవిషయములను సర్వజనానురంజక ముగ ప్రకటించుటకుగాని, యేదో యొక నిర్దిష్టరూపము దాల్చిన మత సాంప్రదాయ మును వ్యాపకము జేయుటకుగాని ఆర్యను ప్రచురించుటయందు శ్రీవారెన్నడును యుద్దేశించి యుండలేదనియు, మానవ జాతి నొక క్రొత్త యుగ మెదుర్కొను చున్నదనియు, జాతిని నూత్నజీవనకు గొని పోగల మహత్తర పరివర్తనము చేసి నయ్యది నడచుచున్నదనియు, ఈ యుద్య మమునందు జాతికి నిజమును దెలుకపఱచి

సరియైన త్రోవను నడపింపనోపిన సత్యా న్వేషణమే శ్రీవారి లక్ష్యమనియు, ఈ యత్నమునకు పునాది కాగల ఆధ్యాత్మి కానుభవ మిదివఱకే వారికి లభించి యుండెననియు, కాని వాని ఫలితార్థముల యొక్క సమగ్ర విర్వచనమును నిరూపింప వలసి యుండెననియు, దీనికై వారు నిర్వి రామ చింతనను పలు మార్గముల జేయ వలసి వచ్చెననియు మొదలు వివరించిరి. ఈ నిర్విరామ బహుమార్గ చింతనా జనిత ఆధ్యాత్మికానుభవ ఫలితార్థ సమగ్ర నిర్వ చన నిరూపణములే యీ యుద్గ్రంథములు.

ఇయ్యవి నూతనయుగ స్థాపనోధ్యమమందు మానవజాతికి మిక్కిలి సహాకారులు.

## సంస్కృతి విభేదములు

"మానవాభి మతములందు భేదమును కల్పించి చివర కిపుడైక్యతకు తారసిల్లు చున్న ప్రాక్పశ్చిమ విజ్ఞాన సంస్కృతి ద్వయంబున కానినుండి సమన్వయము సమకూర్ప మేమిందు యుద్దేశించితిమి. కారణాంతరముచే నయ్యది వలనుపడ దయ్యె. అసంపూర్తియగు యొక వ్యాసా వళి తక్క మిగత "ఆర్య" యంతయు సమరస మొనర్చు యుత్తమ సత్యమును

హైందవ మత దృక్పథము నుండియే యాలోకించి మఱియు నీ దృక్పథము నుండియే పాశ్చాత్య విజ్ఞానమును పరికించినది."

"సృష్టియొక్క మూల సత్యమునకును మనకు గోచరానుభవములగు దాని రూపములకును మధ్యగల సంబంధమును పరిశీలించునది తత్త్వజ్ఞానము. ఆత్మ సత్యమే మూలసత్యమని ప్రగాఢమైన యనుభవము సూచించుచున్నది. రెండవదన్నచో జీవన సత్యము ; రూపము దానిని కల్పించు శక్తి, వీర్యవంతమగు భావము, కార్యనిర్వహణ

దక్షత, వీనిని గురించిన తత్త్వము— ఇందు ప్రాక్పశ్చిమములు భిన్నమార్గముల నవలంబించినవి. జీవన సత్యమునే గట్టిగా నమ్మి ప్రతీచి కొంతకాలము సర్వస్వమును జీవన సత్యమునకే ధారపోసి ఆత్మను త్యజించినది; లేదా నద్దాని నవేద్యము నవిజ్ఞేయమని తోసివేసినది. ఆ విపరీత స్థితినుండయ్యె దిప్పుడు వెనుకకు మరల ప్రారంభించినది. తూర్పన్ననో ఆత్మసత్యమునే గట్టిగా నమ్మి కొంతవఱకు ముఖ్యముగ హిందూదేశమందు దానికే సర్వస్వమును ధారపోసి జీవన సాధ్యతలనన్నింటి

త్యజించినది, లేదా జీవనను సంకుచిత పఱచినది అథవా క్లిష్ట పరిమితికి తెచ్చినది. ఆ విపరీతస్థితినుండి తూర్పిప్పుడు వెనుకకు తిరుగ నారంభించినది. ప్రతీచి ఆత్మసత్యమునకును అధ్యాత్మజీవన సాధ్యతకును ప్రబోధము గాంచుచున్నది. తూర్పు జీవనసత్యము నెడ ప్రబోధముగాంచి ఆత్మజ్ఞాన మద్దానితో క్రొత్తపొందిక గల్పింప సమకట్టుచున్నది. ఈరీతి రెండింటిమధ్య కల్పితమైన వైరుధ్యము వాస్తవమైనది కాదని మామతము.''

మానవజాతి యొక్కటి అయ్యును

విభిన్నాభీప్సితలు గల్గియుండుటచే ప్రాక్పశ్చిమ సాంప్రదాయములని సంస్కృతి రెండుగ పరిణామించినది. సృష్టియొక్క మూలము సాధారణముగ మనకు కనిపించని "బుద్ధిగ్రాహ్య మతంద్రియము" నైన యాత్మ. మనకు గోచరంబయి యనుభవములో నున్నవి నామరూపములే. వీనికిని ఏతన్మూలమగు నాత్మకును మధ్య గల సంబంధమును పరిశీలించునది తత్త్వజ్ఞానము. ప్రగాఢానుభవము ఆత్మసత్యమునకే ప్రాధాన్య మిచ్చుచున్నది. నామ రూపములను కల్పించుశక్తి, వీర్య

వంతమగు భావము, కార్యనిర్వహణ దీక్షిత వీనితో కూడిన జీవన సత్యము రెండవది. ప్రతీచి రెండవదియగు జీవన సత్యమునే గట్టిగా నమ్మి మొదటిదియగు నాత్మ సత్యమును కొంతకాలము త్యజించి దాని నవేద్యమని త్రోసివేసినది. ప్రాక్కన్నో మొదటిదియగు ఆత్మసత్యమునే పూర్తిగా నమ్మి ముఖ్యముగా హిందూదేశమందు రెండవదియగు జీవన సాధ్యతల నన్నింటి త్యజించినది. లేదా క్లుప్త పరిమితికి తెచ్చినది. ఈ విపరీతస్థితులనుండి ప్రాక్పశ్చిమములు రెండును వెనుకకుమజల నారంభిం

చినవి. అనగా ప్రతీచి ఆధ్యాత్మిక జీవన సాధ్యతకును ప్రాక్కు జీవనసత్యమునకును పరిబోధముగాంచి జీవనను ఆత్మజ్ఞానము తో క్రొత్త పొందిక కల్పింప సమకట్టు చున్నవి. ఇది ఇంకను ప్రారంభదశయందే యున్నది. కాని రెండు సంస్కృతులమధ్య కన్పట్టు వైరుధ్యము కల్పితమే కాని వాస్తవమైనది కాదని శ్రీవారి మతము. ఇట్లగుటచే నూత్నయుగ నిర్మాణము కేవల మాధ్యాత్మిక చింతనల వలన గాక, జీవన విస్తరతవలన మాత్రమేగాక, జీవన- ఆత్మ సత్యముల పొందికవలననే కలుగ గలదు.

# నిజతత్త్వ స్వరూపము

"సృష్టియొక్క సత్యము ఆత్మయైనందున జీవన మాత్మ వికాసమె కాగలదు. ఆత్మ జీవనమూలమేగాక దాని కాధారమును, దాని నంటియుండు, సత్యమును, దాని యుత్కృష్టతర పరమావధియు నగుచున్నది. మనకు గోచరించెడు జీవన రూపము లేక కాలమున దాని వేషములును ఆత్మాభివ్యక్త్యోపకరణములు నగుచున్నవి. అయ్యవి వేషరూపమును వదలి యాత్మ యొక్క సిద్ధోపకరణములుగ తనయందు పరిణమించువఱకు మనుజుడు జ్ఞానాభివృద్ధిని

జెంది యాధ్యాత్మిక గుణశక్తులందు పెంపొందవలెను. దివ్య పూర్ణతయందు వృద్ధి నొందుటయే మనుష్య జీవితము యొక్క నిజ ధర్మము. ఆతని భౌతికస్థితిని దైవముయొక్క ప్రతిబింబముగ రూపొందించుట యతని పరిణామందలి యర్థము. ఇదియే 'ఆర్య' యందలి తత్త్వసిద్ధాంతము- మూలసూత్రము."

సృష్టియొక్క మూలము ఆత్మ యైనందున సృష్టియంతయు నాత్మవికాసమే కాగలదు. మనకు గోచరానుభవంబులయిన సృష్టిగత నామరూపము లొక్క

తూరి ఆత్మను వ్యక్తముజేయు నుపకరణ ములను ఆత్మను మరుగుపఱచు ముసుగులును అగుచున్నవి. అవి కేవలము ముసుగులు కాక ఆత్మయొక్క సిద్ధోపకరణాము లగువఱకు మానవుడు జ్ఞానాభివృద్ధిని జెంది అధ్యాత్మిక గుణశక్తులందు పెంపొందవలెను. దివ్యపరిపూర్ణత గాంచుటయే మానవుని నిజధర్మము. ఆతని భౌతికస్థియంతయు దైవమును ప్రతింబింబించు నటుల పరివర్తనము గాంచుటయే పరిణామమందలి యర్థము. మానవునితోగూడ సృష్టియంతయు నీరీతి పరివర్తనము గాంచుటే నవ

యుగ స్థాపనము. అంత సుళువైనది గాక యతి కష్టసాధ్యమైనది—కాని తప్పనిసరి యైనది. ఇదియే శ్రీఅరవిందుల నిజతత్త్వ స్వరూపము.

## దివ్యజీవన

"ఈ సత్యమును మొదలు తత్త్వ విజ్ఞాన దృక్పథమునుండి పరిశీలించవలసి వచ్చినది. జ్ఞాన విచారమునందు తత్త్వ నిర్దేశము మిగిలినదానికంతకు బీజము. దేనిపై నన్నియు నాధారపడియుండునో లేక దేనియం దన్నియు నిమిడియుండునో ఆ తుదిసత్యమును యతిప్రాయికసత్యముల

నది నిర్వచనము చేయును. కావున 'దివ్యజీవన'కు మేము ప్రాధాన్య మొసం గితిమి. ఇందు వేదాంత సిద్ధాంతముల నుండి ఆత్మ, ముఖ్య-ప్రాణము ; సచ్చిదా నందము, జగత్తు ; జ్ఞానము, అజ్ఞానము ; పునర్జన్మ ; అధ్యాత్మ ; వీనిని గురించిన వేదాంతభావములతో ప్రారంభించితిమి. కాని సాధారణముగ వేదాంతమన్న జీవన విముఖత యనియె ఎన్నబడుచున్నది. నిస్సంశయముగ నయ్యదిఘక్కనే యత్యధి కముగ నవలంబించినది. సర్వమును బ్రహ్మ యను ఆదిసత్యమునుండి ప్రారంభించియు

చివరకది జగత్తు కేవల మనాత్మ అబ్రహ్మ మని నిశ్చయించినది; అసత్యాభాసముగ పరిణామించినది. మేమూ వేదాంత భావములనుండి యతిసమగ్రమగు నద్వైత మును ప్రతిపాదింప పూనుకొంటిమి. మనః ప్రాణ శరీరము లాత్మయందుండి జగత్ సృష్టి కాధారమైన అధ్యాత్మమనస్సు లేక పరమనస్సు — అతీతమనస్సు — వలన నుత్పాదింపబడినవనియు, మనస్సాయతీత మనస్సునకు వృద్ధిజెందుటచే జగత్తునందలి ఆత్మయొక్క నిజ సత్యమునకును జీవన నిజసత్య యుత్కృష్ట ధర్మమునకును

మానవుడు జేరగలడనియు చూపించితిమి. ఆత్మ సచ్చిదానందము. దానికిని జగత్తునకును మధ్య మానని వైరుధ్యము లేనే లేదు. జగత్తును మన మజ్ఞానదృష్టితో జూచుచున్నాము. దానిని జ్ఞానదృష్టితో జూడవలెను. భౌతిక పదార్థమందు గోచరంబగు అచేతనమందు చిక్కువడి క్రమాభివృద్ధి గాంచుచు చేతనాయుత పూర్ణతకు మరలెడు మార్గమందున్న జ్ఞానమే మన యజ్ఞానము. ఆ మరల్పును సమకూర్చి మానవజీవితమందధ్యాత్మ జీవన నావిష్కరించుటయే పునర్జన్మ పరంపరలవలని

ప్రయోజనము. పరిణామ మందలి సత్య మును మేమంగీకరించుచున్నాము. పాశ్చాత్య లద్దానికొసంగిన భౌతిక రూపమున గాక దాని తత్త్వార్థసత్యమును, భౌతిక పదార్థమందు ప్రాణము మనస్సు ఆత్మ చిక్కుపడుటయును, పదంపడి వాని క్రమా విష్కారమును, మేమంగీకరించు పరిణామ భావము. ఈ పరిణామాగ్ర· మందధ్యాత్మ జీవన–దివ్య జీవన కలదు.”

ఆర్య యంతయు సమరస మొసర్చు యుత్తమ సత్యమును హైందవ మత దృక్పథ

ము నుండియే యాలోకించినది. కావున శ్రీఅరవిందుల నిజతత్త్వస్వరూపమును తత్త్వతః పరిశీలించిన "దివ్య జీవన"ము నందు ఆత్మ-మనస్సు-ప్రాణము; సచ్చిదానందము-జగత్తు; జ్ఞానము-అజ్ఞానము; పునర్జన్మ; ఆధ్యాత్మ; వీనిని గుఱించిన ప్రాచీన వేదాంత భావములతో ప్రారంభించి, సమగ్రమగు నద్వైతంబు ప్రతిపాదించి, ద్వంద్వంబుల నవిరోధంబులని సమన్వయముచేసి, జగత్ సృష్టిహేతుకమైన పరమనస్సు—అతీతమనస్సు—ఇప్పటివలె మరుగున గాక బహిర్గతమై వ్యవహరింప గల్గు

టయే సిద్ధికేకైక మార్గంబని నిరూపించి, భౌతిక పదార్థమందు ప్రాణము మనస్సు ఆత్మ యివి మొదలు చిక్కువడి క్రిమ ముగ నావిష్కారము జెంది దివ్యజీవనను భౌతికమందు నెలకొల్పుటయే సాధనఫలిత మని విశదపఱచిరి. నవయుగ మందు, రానున్న కృతయుగమునందు, జీవనము దైవముయొక్క విశుద్ధ ప్రతిబింబముగ నలరార గలదనియు, అది సమకూరుట కిందు పరమనస్సవరోహణము తప్పనిసరి యనియు, దివ్యజీవనము నందలి సారాంశ మని తెలియనగు.

# వేదాంతావిరుద్ధములు

"ప్రాచీన వేదాంత సిద్ధాంతముల కీ సత్యములు విరుద్ధములు కావని నిరూపించ నవసర మేర్పడినది. కావున యీ దృక్పథ మునుండి వేదమునకును రెండు యుపని షత్తులకును గీతకును వ్యాఖ్యానములను చేర్చితిమి. కాని వేదము కర్మఠుల వలనను పండితులచేతను తికట మకటము-అయో మయము-కావింపబడినది. దానం జేసి కొన్ని వ్యాసములలో నిప్పటికిని సులువుగా మాత్రము వేదఋషుల రచనా విధాన ములను వారి సాంకేతికములను అయ్యవి

సూచించు సత్యములను విశద పఱచితిమి. ఉపనిషత్తులలో ఈశ కేనలను మాత్రము గైకొంటిమి. పూర్తిచేయ వలెనన్న తైత్తిరేయముకూడ చేర్చవలసియుండెను కాని యది పెద్దది. దానికి పత్రికలో నెడమియ్యలేకపోతిమి.”

ఆర్య రెండవ సంవత్సరమున 'ఏర్చి తీసిన సూక్తము'ల యనువాదమునకు మారుగ 'ఆత్రేయ ఋషుల అగ్నిసూక్తము'ల కనువాదము వ్రాయుచో 'తొలి పలుకు' నందు తమ యనువాద విధాన సరణిని విపుల పఱచి 'రహస్య వేత్తల

సిద్ధాంత' మను వ్యాసమునందు వేదఋషు
ల రచనా విధానమును వా రుపయోగిం
చిన సాంకేతికములను అందలి భావములు
చక్కగా వర్ణించినారు. దీని ఆంధ్రాను
వాదమును యిందు దాదాపు సంపూర్ణ
ముగా వేద రహస్యము బోధపడుటకును
శ్రీవారి మూల సిద్ధాంతము లేరీతి వేద
సత్యముల కన్న భిన్నములు కావని చూ
పించుటకును చేర్చినాము.

## రహస్యవేత్తల సిద్ధాంతము

"ఉపనిషత్తు లందలి యున్నతాధ్యా
త్మిక భావము వేదమందు కలదు కాని ఆ

భాషాసరణి కానరాదు. అది దైవ ప్రేరిత మైన జ్ఞానము. ఆత్మ—మనస్సత్యములను భావ విశేషములుగ మాత్రము గైకొన్న జిజ్ఞాసువులు సూత్రీకారు లింకను కానట్టి యు యదార్థము. ప్రస్ఫుటము, దృగ్గోచ రము, ఘనము అయినట్టి యనుభూతిని గాంచిన ద్రష్టల తేజస్వీనుల భాష యంద లిది. అందలి భావ పాంకమి ప్రాచీనము నిశ్చయానుభవ సిద్ధమైనట్టిది. పరిశోధనా భ్యాసజనిత వైఖరియు గల్గియున్నది. ఇందు ప్రాచీన చైత్యతత్త్వ శాస్త్రమును అధ్యా త్మ జీవన విధానమును గలవు. వీనినుండి

వెలువడిన తత్త్వనిర్ణయములు ఉపనిషత్తు
లు. తరువాతి మేధాఫలితములు హేత్వర్థ
ప్రమాణములు వేదాంత సాంఖ్యయోగ
ములగుచున్నవి. తత్త్వగ్రంథములు జ్ఞాన
కాండ యనంబఱగి మోక్షమును ఏకైక
పరమావధిగా గాంచినవి. వేదము కర్మ
కాండ యనంబఱగి మన ఈ ప్రస్తుతపు
బంధములను పాపమను నయ్యది తిరస్క
రించి తోసివేయుటలో యాశించునది
సిద్ధి ఆత్మోపలబ్ధి అమృతత్త్వము.

"రహస్యవేత్తల సిద్ధాంతము అన్నిటి
వెనుక అన్నిటి నతిక్రమించి మనస్సున

కందరాని అవిజ్ఞేయము నిత్యము అనిర్వచనమైన దొకటి కలదని గుర్తించుచున్నది. వ్యక్తి కానప్పు డది 'తత్' 'ఏకంసత్' అనబడుచున్నది. వ్యక్తిగతమైనపుడు అన్నిటియందు నిగూఢమైయున్న దైవముగ ప్రత్యక్షమగుచున్నాడు. అనేక నామములున్నను నామ రహితుడును, నామ రూప గుణవిశేషము లన్నియు తనయందు గల్గియున్నను అప్రమేయుడు గుణాతీతు డాయన.

"ఆ దైవము మూలకారణమును తుది ఫలమును రెండు అగుచున్నాడు. ఆ నిత్యో

డు, సృష్టికర్త, ఈశుడును, పురుషుడు స్త్రీయును, సత్తాయు చైతన్యమును, జగత్పితామాతయు, జగద్వ్యాపియు పుత్రుడును అగుచున్నాడు. అతడు, రుద్ర విష్ణు ప్రజాపతి హిరణ్యగర్భ సూర్య ఇంద్ర అగ్ని వాయు సోమ బృహస్పతి వరుణ మిత్ర భగ ఆర్యమలోనగు విశ్వే దేవతలగుచున్నాడు.

"మనయందును మన వెలుపలను ఆత్మోపలబ్ధితోడను బాహ్యదృష్టితోడను జూడగల ఈ విశ్వమును దైవము కడు సంశ్లిష్ట లోక సరణితో నిర్మించెను.

అయ్యది పైకిప్రాకు భూస్వర్గముల పంక్తి
యు ; వివిధ అపోధారయు ; సప్త, అష్ట,
నవ, దశ, రశ్మి తేజమును ; పలు విశాలో
న్నత సానువులతో గూడిన అద్రియు.
ఋషులు దీనిని ముమ్మాడగు శ్రేణులుగ
వర్ణించుచున్నారు. మూడధోలోకములు-
స్వర్గము, భూమి, అంతరిక్షము ; మూడు
మధ్య లోకములు—శోభామానము లగు
సూర్య (సవితః) లోకములు ; మూడూర్ధ్వ
లోకములు—దైవముయొక్క పరానంద
లోకములు. ఇవి యితర సూత్రములతో
కలసి బహు క్లిష్ట మగుచున్నవి........

ఇవి తత్త్వ సాంకేతికములు. ఏలన, సృష్టియంతయు ఆత్మయొక్క ఆవిష్కార మేగాన లోకములయొక్క ప్రతి బాహ్య సరణియు తనయందలి యొక్కొక భూమికలో అయ్యదియే చైత్యశక్తి యొక్క బాహ్యసాంకేతికము ఆ శక్తియొక్క భౌతిక ప్రత్యామ్నాయమై తత్సరణికి చేరిన యంతర్భూమికల కాధారము కావలెను. ఈ సూత్రములే సప్తవ్యాహృతులు. పురాణముల యందీలోకసరణినే చూడ గలము. వీని నీ క్రింది పట్టిక రూపమున వ్రాయ వచ్చును.

| తత్త్వ-మూలము | లోకము-వ్యాహృతి |
| --- | --- |
| 1. శుద్ధసత్తు—సత్. | పురుషుని యొక్క—అత్యుత్తమ సత్య లోకము (సత్య లోకము—సత్యం) |
| 2. శుద్ధ చైతన్యము —చిత్. | అనంతేచ్ఛ — చిత్శక్తి లోకము (తపో లోకము—తపః) |
| 3. శుద్ధానందము—ఆనంద. | సృష్టి కారణ ఆనంద లోకము. (జన లోకము—జనః) |

| | |
|---|---|
| 4. జ్ఞానము లేక సత్యము—విజ్ఞానము. | బ్రహ్మలోకము (మహర్లోకము—మహః) |
| 5. మనస్సు. | తేజోలోకము(స్వః) |
| 6. ప్రాణము. (స్నావిర పురుష) | వివిధ సంభూతి లోకములు (భువః) |
| 7. అన్నం-శరీరము-భౌతికము. | భౌతిక లోకము (భూః) |

"పురాణములందలి ఈ సప్తలోకములు వేదమందు దొకరీతి వర్గీకరణము చేయబడినవి—మూలమందు యేడు లోకములు, ఆచరణయందు అయిదు, సాముదాయిక

వర్గీకరణమున మూడు.

| | |
|---|---|
| 1. పరమ– సచ్చిదానందము. | దివ్య త్రిలోకములు. |
| 2. సంధానలోకము. (అతీత మనస్సు పరమనస్సు) | సత్యం ఋతం బృహత్ (స్వర్గమందభివ్యక్తమగు మూడు ప్రకాశవంతమగు నాకములు) |
| 3. మూడధోలోకములు. | |
| శుద్ధమనస్సు. | దివి (మూడు నాకములు) |

| | |
|---|---|
| ప్రాణశక్తి. | మధ్య భూమిక (అంతరిక్షము) |
| భౌతికము. | భూమి (పృథ్వి త్రయం) |

"ఒక్కొక భూమికయు తనయందు తన యధీనతలో నితర లోకములు యావిష్కారము నొందుటచే మార్పునొంది చిచ్ఛక్తి యొక్క సృష్టి హేతుక తేజంబుచే స్వయం నిర్ధారితములగు వర్గీకరణమువలన పలు రాష్ట్రములగ విభాగము కాగలదు. ఈ యల్లికయందు ద్రష్టలయొక్క సూక్ష్మ-దృష్టి-సంశ్లిష్టతలను రసవంతమగు కల్పన

లను ఇముడ్చవలెను. ఈ రాష్ట్రములిప్పుడు విరోధి రాజన్యుల పాలయినవి. దేవతలు వానిని జయించి ఆర్యారాధకునకు యొసంగుదురు.

"కాని ఈ లోకము లెక్కడ యున్నవి? ఎందుండి సృజింపబడినవి? ఈ విషయమున వేదఋషుల భావమత్యంత గంభీరమైనది. మానవుడు పృథ్వీ మాతాగర్భస్థుడయి ఈ మర్త్యలోకమును మాత్ర మెఱుగును. ప్రకాశవంతమైన రహస్యమందుంచబడిన దివ్యలోకములుగల పరాచేతనోన్నతాతీత మొండు గలదు. తా

నెఱిగియున్నదానిక్రింద అధశ్చేతనము లేక నిశ్చేతన మొకటి కలదు. ఆ చూలాలైన రాత్రియందుండి తాను చూచు ఈ లోకము లుద్భవించుచున్నవి. ప్రకాశ వంతములగు నా యూర్ధ్వలోకములకును అంధకార బంధురంబైన యధోలోకముల కును మధ్యనున్న విక్కడి లోకములు. మనజుడు ప్రాణమయ లోకమందుండి ప్రాణమయ పురుషుని గైకొనుచున్నాడు. మనోమయ లోకమునుండి తన మనస్సు నున్నా; వానితో నెల్లపుడు రహస్య సం బంధము కల్గియున్నాడు. తా నిచ్ఛగించిన

చో బాహాటముగ వానిని చేరగలడు. వానియందు జననం బందగలడు. సత్య లోకములగు సూర్యలోకములకు పైకి పర చేతనను ప్రవేసించి పరమును జేర గలడు.

"ఈ మానవారోహణము వేయి సారులు తాను భూతనుడయ్యేను సాధింపగలడు. పృథ్వి యాతని తల్లి యెట్లో దివియు నతని పిత యగుచున్నది. తనలోని గంభీరాగాధములకును యున్నత తరాగ్రములకును తాను పరిబోధముగాంచుట కతనికి యధికారము కలదు. ఈ పరిబోధమే యాతని నిర్దిష్ట

భ్యుదయము. తనయందుగల యున్నతో
న్నత భూమికల నెక్కుకొలది నూత్న
భూమికలాతని జీవనకు దృష్టికి లభ్యంబై
యాతని ఉపలబ్ధికి క్షేత్రమును ఆత్మకు
గేహమును అగు.

"దేవతలు లోకశ్రేణులను విశ్వమందు
సృజించినటులనే మానవుని చేతనయందీ
క్రమారోహణ వర్గీయభూమికలను నెల
కొల్పి యాతనిని మర్త్యస్థితినుండి అమృ
తత్త్వమునకు జేర్ప కృషిచేయుదురు.

"వేదమందలి భావము, అనుచరణ
విధానము, మర్త్యడమృతత్త్వమును బడయ

నాకాంక్షించుటనుగూర్చియే అగుచున్నది. అమృతత్త్వమును గూర్చిన యత్యంత ప్రాచీన సువార్త వేదము. దైవప్రేరిత ద్రష్టలయొక్క ఆద్యశిక్షణనీ మంత్రములు దాచియున్నవి.

"సృష్టికిచేరిన మూలాధారములు సత్పదార్థము, చేతనయొక్క తేజస్సు, ప్రజ్వలించుశక్తి, అధీనమైన యానందము. మనయందు వీని సమ్మేళనము పరిమితము, ఛిద్రము, కుంఠితము, భేద్యము అస్పష్టము కాగలదు. లేక, అనంతము, తేజోమయము, భూమము, పూర్ణము, అకుంఠి

తము కావచ్చును. పరిమితి–బంధనము–మృత్యుపదము. అవ్యయమందు ఆత్మాధీనత చేకూరినంతనే, సుస్థిరానంతముల యందు నిలిచి చరించు సామర్థ్యము కల్గగనే, అమృతత్త్వము లబ్ధంబగు. కావున సత్పదార్థమునందభివృద్ధి గాంచి నిరంతరము ప్రజ్వరిల్లు ఇచ్ఛాగ్ని జ్ఞానతేజములను ప్రకాశింపచేసి చేతనను పొడిగించి శక్తిబలముల విస్తరింపజేసి ఘనతరానందమును స్థిరపఱచి జీవుని అప్రమేయ శాంతియందు విముక్తుని జేయుకొలది మానవుడు అమృతత్త్వము సాధింపగల్గు.

"భూమంబగుటయే క్రొత్తజన్మమెత్తుట యగును. అభీప్సతోఁగూడిన అన్నమయ పురుషుడు కష్టించి శ్రమపడు ప్రాణమయుం డగు. ఆపయి నాతడు సూక్ష్మ శారీరియగు మనోమయ చైత్యపురుషుడగు. ఈ సూక్ష్మ శారీరి యెల్లెడలనుండి సత్యధారలు గుమి గూడి ప్రవేశింప నుస్మిలనుడయిన విశ్వ మయతంగాంచు. విశ్వమయుం డీ యుప లబ్ధియందు పెంపొందుచు ఉన్నతతర శాంతి ఆనంద సమరసములకయి కృషి యొనర్చు అధ్యాత్మమయుండగు. వీరు ఆర్య లందలి పంచ వర్ణములు. వీని నన్నింటి నతిక్రి

మించి కేవలమును జేరజూచు కేవలుడైన ఆర్యుడును కలడు.

"ఈ మహత్తరమగు అంతర్పరివర్తనమునకు సాధనము పరమనస్సత్యము. అది మనస్సునకు బదులు తేజోవంతమగు దృష్టిని, దివ్యచక్షువును, మర్త్య జీవనకు బదులు అమృతత్వమును చేకూర్చును. కావున మానవుని పురోగమనము మొదలు క్రియాచరణమువలన గల్గు సర్వ తాకిడులను, అనుభవములను భరింప నోపిన సుసంపూర్ణమగు ప్రాణమందాత్మ విస్తరతయును నిర్మలమగు మానసిక చైత్య విశుద్ధత

యును పొందవలెను, ఆవెనుక మానవుని దైన ఈ ప్రకాశము శక్తిని మించి యనంత సత్యము అమృతేశ్ఛయందు పరివర్త నము నొందవలెను.

"మన సాధారణ ప్రాణమును చేతన యును అంధకారనిశిని పోలినవి. ఉన్నతో త్తమ సత్యసూర్యు డుదయమగుచో నుష సమాగమంబగును. ఉషతోకూడ ప్రయో జనకారియైన క్రతువు యాసన్నమగును. క్రతువుచే నుషయు నష్ట సూర్యుడును పునరావృత్తియగు నిశియందుండి సదా జయింపబడును. ప్రాణియొక్క అంధకార

గుహాంతరాళముల నుండి వెలుగు మందలు విముక్తములగు. క్రతువుచే మన కొఱకు విస్తారమగు నాక వర్షములు కురి పింపబడును. ఊర్ధ్వసత్తునందుండి సప్త అపోధారలు భూమిపయి ఝుటితో నవరో హించు. ఏలన, వృత్రాసుర బంధములు దివ్యమనస్సుయొక్క విద్యుత్కాంతులచే విదళించబడినవి. మనల నది మహోత్తమ స్వర్గములకు తన యానందామృతధారలచే లేవనెత్తుచున్నది.

"ఊర్ధ్వలోకస్థులగు శక్తులకు మనము పొందు లాభములను చేయు పనుల నర్పిం

చుటయే యజ్ఞము, క్రతువు. కానరాని దేవతలకు తన్నుదా నర్పించుకొని యూప స్తంభమునకు బంధింపబడిన యజ్ఞపశు వగు జీవునితో కూడిన నిస్సహాయ మూక యజ్ఞమీలోకమంతయు. బంధ విమోచ నము చేయువాక్కు-ను-మంత్రము-ను-కను గొనవలె. తేజోవంతమగు సూక్తమును హృదయమందు పూరింపవలె. జీవు డాపయి యజ్ఞపశువే గాక యజమానియై యుండ గల్గి చేతనాయుత స్వేచ్ఛార్పణముగ మాన వుని మనః ప్రాణములు మార్పు జెంద వలెను.

ఋతమైన యజ్ఞము వలనను, తన యంతరాళ మందుండి దేవతల కొఱకు పవిత్ర సూక్తముగ వెలువడి సర్వమును సృజించునట్టి సర్వమును వ్యక్తముజేయు నట్టి వాక్కు చేతను మానవుడు సర్వమును సాధింపగల్గు. సిద్ధిని విజయమును గాంచు. ప్రకృతి తనను కోరి వరించు కన్యగా తనను చేరు. అత డామెయందలి ద్రష్టయై ప్రభువవలె యామెను పాలించును.

దేవతాహ్వాన ప్రార్థనాత్మకము గు సూక్తిచేతను, దేవతాప్రతిష్ఠకైన స్తోత్రమగు సూక్తి చేతను, దేవతాప్రాప్తి—

ఆత్మాభివ్యక్తమున—కైన సూక్తి చేతను మానవుడు తనయందు దేవతలను నెల కొల్పి నవద్వారయుత గేహంబగు తనశరీర మునందు సజీవములగువారి ప్రతిమలను ప్రతిష్ఠించి, దివ్యజన్మలందు వర్ధిల్లి, తన యాత్మ వసించుటకు తనయందు భూమము ప్రకాశవంతమగు లోకములను నిర్మించు కొనును......తన పూర్ణపురుషత్వమును నిర్మించుకొని దుష్టసేనల నిర్మూలింప తన దేవతలకు తోడ్పడును. తన ప్రకృతిని విభా గించి, చీల్చి, మలినపఱచిన తన యాధ్యా త్మిక శత్రుబలగము లంత చంపబడుదురు.

"కొన్ని వేళలందీ క్రతువు యాత్ర యాన మని వర్ణింపబడివది. ఏలన, అది పురోగామి. ఉద్గామి. అదియొక లక్ష్య యుతము—విశాలత, సత్యసంధత, తేజ ము, ఆనందము. లక్ష్యసిద్ధికై శుభము, సరళము, సుఖదాయకమగు మార్గమును, దుర్గమ మైనను ఆనందభరితమైన సత్య మార్గమును, కనుగొని వెంబడించుటకు ఆది యాహ్వానింపబడినది. దైవికమయి ప్రజ్వరిల్లు యిచ్ఛాబలముచే పర్వతము నందువలె భూమికనుండి భూమికకు నారో హించును.

“ఇది సుళువు శాంతమయిన నడక కాదు. కడుదీర్ఘము భీకరము, నిర్మొగ మోట మగు పోరాటమే. ఆర్యుడు కష్టిం చి, పోరాడి, జయించవలె. అతడు శ్రమ నొందని కృషీవలడు, యాత్రి, ఉగ్రుడైన యోధుడు కావలె. అతని పురోగమనం బంతయు దేవతలు-రాక్షసులు, సురలు-అసురులు, ఇంద్ర-వృత్ర, ఆర్య-దస్యుల మధ్య జరుగు యుద్ధమే.

ఈ విభజనకారులు, దోపుడు కర్తలు, దుష్టశక్తులు, విభజనక్రియకు మాతయగు దితి తనయులు, ఈ దానవులు, ఋషులచే

పెక్కు సమష్టి నామములతో బేర్కొన
బడిరి—రాక్షసులు, వృకులు, అశనులు;
ప్రత్యేక నామములు కూడ వాడబడినవి.
వృత్ర, ఘోర విరోధియగు సర్పము, దివ్య
సృష్టి సాధ్యతలను దివ్య కర్మలను తన
యంధకారమయమగు చుట్టలచే నిరోధిం
చువాడు; నముచి, బలహీనత యొక్క
స్వరూపమై మనుజు నెదుర్కొనును. వల,
పణిలు, విషయలోలురు, ఉన్నత తేజ
మును దాని ప్రకాశములను దొంగలించి
దాచి మలినపఱచి దురుపయోగము
చేయువారు. ఈ మూర్తులందరు మన య

జ్ఞానము, పాపము, బలహీనత, బంధము వీనియొక్క కేవల మూర్తిభూతములకన్న కడు గొప్పలయి మనుజునితో సదా పోరాడుదురు.........వీరిని పారదోలి,లొంగ గొట్టి, చంపి, సహకారులగు బలీయ దేవతల సహాయమున అంధకారమున పడద్రోయవలెను.

"వేదమందలి దేవతలు జగదీశ్వరుని నామములు, రూపములు, వ్యక్తులు. దివ్య సత్త (పురుషుని)యొక్క ముఖ్య ఐశ్వర్యములకు ప్రతినిధులు. విశ్వమును వారభివ్యక్తముచేసి దానియందు తా మభివ్యక్తు

లగుదురు. తేజము యొక్క పుత్రులు, అదితి తనయులు. మానవుని యాత్మను తమ సోదరునిగను సహకారిగను కని సించి, వాని లోకమును తమ తేజము, శక్తి, సౌందర్యముల యధీనతకు తెచ్చు నటుల వానియందు తాము పెంపొందుట చే వానికి తోడ్పడి వానిని వృద్ధిజేయ నాశింతురు. దివ్య సౌజన్య-సహాయోధ్యులకు దేవతలు మానవుని యాహ్వానింతురు. అందుకు మారుగా మానవుడు తానుచేయు క్రతువునకు వారి నాహ్వానించి తన దేహ ములను, బలములను, తన స్వాచ్ఛందముల

ను, మధువులను—ప్రకాశించు ధేనువు యొక్క పాలు, వెన్న, ఆనందలత నుండి స్రవింపబడిన రసమును, యజ్ఞాశ్వమును, యవలును—వారి కర్పించును. వారిని తన జీవమందును వారొసంగు సంపదలను తన ప్రాణమందును పరిగ్రహించి వారి యుత్కృష్టము, తేజోవంతమగు దైవతములను వృద్ధిజేసికొనును.

"ఒకసారి వేదఋషుల సాంకేతములందలి కీలకమును గుర్తించితిమేని వేదమందలి భావములను సులువుగా తెలిసికొనగలము. కాని వానిని కేవలము

సాంకేతములే యని పొరబడకూడదు. వేద ఋషుల కీ దేవతలు ప్రాణవంతమగు నిజ స్వరూపములు. జీవుని గతాగతములు విశ్వ మందలి సూత్రముల సూచనల సంఘట్ట నము మాత్రమేగాక, వానికి రూప మొసం గి భరించు విశ్వ శక్తుల సంఘటనయే య గు చున్నది. ఇవి సురలు–అసురులు. విశ్వ రంగము నందును వ్యక్తిగత జీవుని యం దును ఆ నిజమైన నాటకము ఆ పాత్రల తోడనే నటింపబడుచున్నది.

"యజ్ఞమే దేవతల కారాధితము? ప్రవర్ధమానమగు దేవత్వమును మనుజుని

లో నావిష్కరించి రక్షించుటకు మెవరి నాహ్వానింపవలెను?

"మొదలు అగ్ని. అతను లేనిదే జీవుని యజ్ఞవేదిపై యజ్ఞజ్వాల ప్రజ్వలింప నేరదు. ఆ యగ్నిజ్వాల సప్తజిహ్వాత్మకమగు నిచ్ఛాశక్తి, జ్ఞానముతో కూడిన దైవశక్తి. ఈ చేతనయుతము వీర్యవంతమగు ఇచ్ఛ మర్త్యునియం దదిష్ఠితమై యున్న యమర అతిథి, విశుద్ధహోత, దివ్యకృషీవలుడు, భూ నాకముల నడుమ వర్తించు మధ్యవర్తి—హుతాశనుడు. మన యర్పణలను విశ్వశక్తులకు చేర్చి

అందుకు బదులు మనుజులకు విశ్వ దేవత లోసంగు శక్తి తేజ ఆనందములను కొని వచ్చు హవ్య వాహనుడు.

"తర్వాత మఘవానుడగు ఇంద్రుడు. దివ్య మనస్సుగా ఆత్మావిష్కారము నొందిన శుద్ధసత్తయొక్క శక్తి. భూమినుండి స్వర్గమునకు తన జ్వాల నూర్ధ్వముగ ప్రసరించు సహజ జ్ఞానయుత శక్తి ధృవమొందు అగ్ని యెట్లగుచున్నాడో అట్లే ఇంద్రుడును స్వర్గమునుండి భూమి కవరోహించు సహజ శక్తియుత తేజోధృవేతర మగుచున్నాడు. ప్రకాశవంతమగు అశ్వములతో మన

లోకమున కేగు యోధుడయి తన విద్యు
త్తతులతో నంధకారమును విభేదములను
ఛేదించి, ప్రాణ పదములగు స్వర్గపోధారల
ను క్రుమ్మరించి, కోల్పోయిన లేక దాచ
బడిన వెలుగులను తాదాత్మ్యజ్ఞానము—
అంతర్బోధ—యను సారమేయ జాడలచే
గుర్తించి మన మనో నాకమున సత్య
సూర్యుని యుచ్చస్థితికి కొనివచ్చు నాతడు.

"ఆ పయి, సూర్యుడు—పరమ సత్యా
ధినేత—సర్వమును సృజించు లేక అభి
వ్యక్తపఱచు నాతడు—ఏలన, సృష్టి సత్
చిత్తుల యావిష్కారమే. జీవులను పోషిం

చి వికసింపజేయుతండి). దివ్య ఉషస్సు జాడను మనల జేరునట్టి మన మన్వేషించునట్టి తేజము లీ సూర్యుని మందలు. అయ్యవి మనయందు ఉత్కృష్టానందము వఱకు నిశిబద్ధమైన భూమికనుండి భూమికను బయలుపఱచి ప్రత్యక్షము చేయును.

"ఆ యానందమునకు ప్రతినిధి యైన దైవముసోమ. భూజాతములందును జీవనాపస్సులందును దాచబడియున్న దతని యానందామృతము; ఇక్కడ మన ఈ భౌతిక శరీరమందును యాతని అమృతరసము కలదు. దానిని స్రవింపజేసి దేవ

తల కర్పించవలె. దాని బలముచే వీరు వృద్ధిబొంది జయింతురు.

"ఈ ప్రధాన దేవతలలో నొక్కొక్క రును తనదగు యధికారమును నిర్వహించుటలో నాతనికి తోడ్పడు యితర దేవతలను కల్గియున్నారు. మన మర్త్యత్వము నందు సుస్థిరముగ సూర్యసత్యము ప్రతిష్ఠింప బడవలెనన్న నపరిత్యాజ్యములుగ ముందు జరుగవలసిన నియతులు కొన్ని కలవు. విశాలమగు శుద్ధత, సర్వ పాపములను, అనృత వక్రతలను నసింపజేయు స్ఫుటమగు విస్తరత యుండవలెను—ఇదే

వరుణుడు; మన సర్వచింతనలను, కర్మలను, ప్రేరణలను, సమరస మొనర్చు నోపిన ప్రకాశవంతమైన ప్రేమ, గ్రహణ శక్తి—ఇదే మిత్ర; నిర్మలము వివేకవంతమగు యభీష్ట-యత్నముల అవ్యాహతాఖండలత—ఇదే ఆర్యమ; పాపము, స్ఖాలిత్యము, బాధ, వీనిని పారద్రోలి సర్వవిషయములను సుఖముగ అయత్నీకృతముగ సరిగ యనుభవించుట—ఇదే భగ; ఈ నాల్గును సూర్య సత్యముయొక్క శక్తులు.

"మన ప్రకృతియందు సోమునియొక్క పూర్ణానందమును స్వచ్ఛందముగ నెల

కొల్పుటకు సుఖము ప్రకాశవంతము అకుంఠితమైన మనఃప్రాణ శరీరములు అవసరములు. ఇయ్యది అశ్వినులచే సమకూర్పబడగలదు. తేజోతనయకు వైవాహితులయి, మధుపానముచేసి, సిద్ధసంతృప్తులను సమకూర్చి, వికలత రుగ్మతలను మాన్పి, మన జ్ఞాన క్రియాభాగముల నాక్రమించి సుగమము జయప్రదమగు నారోహణమునకు మన మనఃప్రాణ శరీరములను సిద్ధపఱచెదరు.

"రిభులింద్రునికి సహకారులు. శిల్పులు. మానవశక్తులగు రిభులు యజ్ఞక్రతు

వు వలన సూర్యునియొక్క ఉన్నత స్వధా
మమున కారోహించుటచే అమృతత్వ
మును జెంది తాము సాధించినదానిని
మానవులు తిరిగి సాధించుటకు తోడ్పడు
దురు. మనస్సుచే వారింద్రుని యశ్వము
లను రూపొందించెదరు. అశ్వినుల రథము
ను, దేవతల ఆయుధములను, యాత్రికు
యుద్ధమునకు కావలసిన సాధన సంపత్తిని
వారు సిద్ధము చేయుదురు. సత్య తేజము
నొసంగునట్టి వృత్రుని వధించునట్టి
ఇంద్రునకు మరుత్తులు సహాయపడుచున్నా
రు. సర్వ చింతనకు, వాక్కునకు వెనుక

నుండి వాని నుత్సహించుచు పరమచేతన యొక్క తేజము సత్యము ఆనందముల కొఱకు పోరాడెదరు వారు.

"స్త్రీ శక్తులకూడ యున్నవి. ఏలన, దేవతపురుషుడును స్త్రీయునై యున్నది. అందరిలో మొదలు అదితి. దేవతల యనంత జనని. సత్యచేతనయొక్క పంచ శక్తులును కలవు—మహి లేక భారతి. దివ్యమూలమునుండి సర్వమును బహిర్గత ముచేయు దివ్య విపుల వాక్కు; ఇళ, మనకు వీర్యవంతమైన దృష్టిని కలుగజేయు సత్యముయొక్క బలాఢ్యమైన ఆది వాక్కు;

సరస్వతి, దాని ప్రవహించుధార, దైవ ప్రేరితమైన వాక్కు; సరమ, నాకశ్వా నము, అధశ్చేతన గహ్వరమున కవరో హించి యందు దాచబడియున్న తేజము లను కనుగొనుచున్నది; దక్షిణా, సరియైన వివేచన శక్తి; యజ్ఞమందు క్రతువును హవిస్సులను దేవతలకు వారివారి భాగము లను పంచిపెట్టును. ప్రతి దేవతయు తన దైన స్త్రీశక్తిని గల్గియున్నాడు.

"ఈ క్రతువు, పోరాటము, ఆరోహ ణము. మన శుద్ధమానస, చైత్య, భౌతిక చేతనలను క్రమముగ పోషించు దేవతల

తల్లిదండ్రులును మన తండ్రియగు నాకము చే, తల్లియగు పృథ్వీచే భరించి వహింపబడుచున్నది. వారి విపుల స్వచ్ఛంద ప్రసరణమే మనము సాధించు దానిని నిర్ణయించును. వాయువు—మాతరిశ్వుడు—అంతరిక్షము చేతను ప్రాణశక్తి చేతను నారెంటిని సంధానము చేయును. పర్జన్య—నాకవర్ష ప్రదాత; దధిక్రావన—దివ్య యుద్ధాశ్వము: అగ్నియొక్క శక్తి; మూడవ భూమికయందు మన త్రిపురుషమును పరిపక్వము జేయు త్రితాపత్య; యింకా యితర దేవతలును గలరు.

"మన సిద్ధికీ దేవతలను వృద్ధి నొందించుట మిక్కిలి అవసరము. మఱియు నా సిద్ధి అన్ని భూమికల యందును బడయవలెను—మన భౌతిక శారీర-పురుష-చేతనల విశాలతయందును; మన యుద్యమమును మందుకొనిపోవు వాహనముగ చేకొనబడిన అశ్వమునా బఱగు ప్రాణ శక్తి యొక్క పూర్ణవేగము, గతి, అనుభవములందును; హృద్ప్రేరణల విశుద్ధానందమునందును; మన బౌద్ధిక చైత్య సత్త్వాల మనో ప్రకాశ వినిర్మలత యందును; మన సర్వ జీవనమును పరివర్తనము చేయగల

పర మనోతేజము, యుషస్సు, సూర్యుడు, ప్రకాశవంత మగు మండలతల్లి, వీరి ఆగమనమునందును—ఏలయన, ఆ తీరున సత్యము మన కధీనమగును. సత్యము వలన ఆనంద వార్ధియు, ఆనందమునందు కైవల్య సిద్ధియు గల్గును.

"పురాణమందలి త్రిమూర్తి మూలము ను పర దైవతము యొక్క యుత్కృష్ట పూర్ణతలును యగు ముగ్గు రుత్తమ దేవ తలు ఈ వికాసమును ఊర్ధ్వ పరిణామము ను సాధ్యము కావింతురు; విశ్వ మందలి ఈ సంశ్లిష్ట మూల శక్తులను వాని

మహోత్తమ సరణియందు పోషించెదరు.
బ్రహ్మణస్పతి–సృష్టికర్త; తన వాక్కుచే,
ఉద్ఘోషచే, సృజించును—అనగా, నిశ్చేత
నాంధకారము నందుండి సర్వ సృష్టిని,
చేతనయుత జ్ఞానమును, ప్రాణ చలనము
ను, రూపములను అభివ్యక్తము చేయును.
రుద్రుడు–ఉగ్రుడు, సదాశివుడు, మహా
బలుడు, జీవమును నెలకొల్పుటకు ప్రాణ
సంఘటనపయి నధిష్టించియుండు; ఆయన
ఆయుధపాణి. సృష్టిని ముందుకు బలత్కార
ముగ లేవనెత్తు దైవముయొక్క ఘోర
శివమూర్తి, అడ్డగించుదానినెల్ల చెండించు

ను; విరోధించి తప్పు జేయుదానినంతయు విదళించును; ఘాతి నొందిన, బాధ జెందిన, మొరలిడెడు, శరణుజొచ్చినదానినంతయు నోదార్చి రక్షించును. విష్ణు—ఈ లోకము లన్నింటిని తన మూడంగలలో ధరించు భూరివ్యాప్త మూర్తి; పరిమితమగు మన మర్త్యత్వములో నిందు౯ని క్రతువునకు విశాలమగు స్థాన మేర్పఱచు నాతడు; అతనితో అతని వలన మనకు నెచ్చెలి ప్రియుండును సఖుడును సుందర మూర్తియైన దైవమును కనుగొనగల ఉచ్చస్థాయికి మనము జేరగలము.

"సృష్ట్యాత్మక నిశ్చేతనాబ్ధ్యంధ కారమునందుండి యున్నత రూపములతో ఊర్ధ్వముఖంబయిన శిఖరములతో జీవన అపోధారలను విద్యుల్లతలను యొసంగు మేఘములతో మన పృథివి రూపొందింప బడి స్వర్గమువైపు లేవనెత్తబడుచున్నది. క్రింద నుండు అధశ్చేతనాబ్ధినుండి మధు ప్రకాశ ధారలు పైకెగసి ఊర్ధ్వమందుండు పరచేతనాబ్ధి నాకాంక్షించు; పైనుండి ఆ యబ్ధి తేజో, సత్య, ఆనంద, వాహిను లను మన భౌతిక శరీరమునకు సయితము క్రిందికి పంపును. ఈ విధముగ వేదఋషులు

మన ఆధ్యాత్మికారోహణ సూక్తమును భౌతిక ప్రకృతి సాంకేతికములతో స్తుతించిరి.

"ఈ ఆరోహణమును మన పూర్వులు-పూర్వపితరులు- మును పే సాధించి వారి సంతతి కింకను ఆ మహదాత్ములు తోడ్పడు చున్నారు. నూతన యుషస్సులు పూర్వ యుషస్సులను పునరావృత్తి యొనర్చుచూ భవిష్య ద్యుషస్సులవైపు ముందుకు చూచుచున్నవి. మానవ యనుభూతియందు పలుమారు పునరావృత్తి కాగల యొక విధమగు అధ్యాత్మిక విజయములే కణ్వ, కుత్స, అత్రి, గోతమ, సునస్సేప యను

నవి. సప్తఋషులు, అంగీరసులు, సూక్త మును పఠించి, గహ్వరమును భేదించి, పోయిన మందలను కనుగొని, దాచబడిన సూర్యుని తిరిగి తెచ్చుటకు యింకను సదా సిద్ధముగ వేచియున్నారు. ఈలా మిత్రుల తోడను, శత్రుల తోడను, సహ కారుల తోడను,నిండియున్న కదనరంగము జీవి. ఇదంతయు జీవ వంతము, ఫలదము, వ్యక్తిగతము, చేతనయుతము, ప్రాణవం తము. యజ్ఞము వలన సూక్తిచే ప్రకా శించు దృష్టలను వీరులను క్రతుపుత్రు లుగ మనము సృజించుకొను చున్నాము.

ఋషులును దేవతలును మనకు తేజోవంత
ములగు మందలను కనుగొనుచున్నారు;
రిభులు మనస్సుతో దేవతల రథములను
అశ్వములను ప్రకాశించు ఆయుధములను
రూపొందించుచున్నారు. ముందుకు మీదు
కు సకిలించుచు దుముకుచు మనలను నెక్కించు
చుకొని పోవు అశ్వము మన ప్రాణము.
దాని శక్తులు వేగవంతములగు సైంధవ
ములు. విముక్తిగాంచిన మనో శక్తులు
విశాలమైన రెక్కలుగల పక్షులు; ఈ
మనోమయ పురుషుడు, ఈ జీవి పైకెగయు
హంస; నూరు అయఃకుడ్యములను భేదించి

సోమామృతమును రక్షకులనుండి బలాత్కారముగ గైకొనివచ్చు గరుత్మంతుడు. హృదయ గహ్వరము నుండి వెలువడు దైవోన్ముఖంబయిన యొక్కొక ప్రకాశవంతమగు చింతనయు హోత, బ్రహ్మయునై తేజోవంతమైన యనుభూతిని పూర్ణ సంసిద్ధిని గూర్చిన దివ్య సూక్తమును స్తుతించును. ప్రకాశించెడు సత్య హిరణ్యమును మన మాకాంక్షింతుము. స్వర్గ నిదానమునే మనము కామించెదము.

"మానవ జీవుడు పురుషులతో నిండిన లోకమును, ఉత్తమ విజయమునకు సహా

కారులు లేక నిరోధులగు యోధు లెదు
రొక్కను రాజ్యమును, దేవతలు మన
కధితులై యున్నట్టి అసురులు స్వాధీనము
చేసికొన యత్నించు గేహమును, అగు
చున్నది. అందలి శక్తుల పూర్ణతయు పురు
షుని యొక్క విశాలతయు స్వర్గ సదస్సునకు
విస్తరింపజేసి, అమర్చి, శుద్ధి జేయబడిన
బలిపీఠ మగుచున్నది.

"ఇవి వేదమందలి ముఖ్య సాంకేతిక
ములు. పూర్వులయిన పితరుల శిక్షణ
యొక్క అతి సంక్షేపము అసంపూర్ణమగు
వర్ణన. ఈ రీతిగ నర్థము చేసికొనినచో

ఋగ్వేదము అగోచరము అయోమయము అనాగరికము అయిన సూక్త నిచయంబను భావము తొలగిపోవును. మానవునియొక్క ఉత్తమాభీప్స యొక్క గానమగుచున్నది. జీవుని అమృతారోహణమును గూర్చిన ఇతిహాసమందలి వీణాగాన గాథ లగుచున్నవి.

"ఇప్పటి కింతమాత్రము. ప్రాచీన శాస్త్రమును, గతమైన జ్ఞానమును, పూర్వచైత్య-భౌతిక సాంప్రదాయమును అయిన వేదమందు ఇంకను ఏమి కలదో కనుగొనవలెను......బాహ్య జీవనయొక్క క్షణభంగురములగు విచిత్రములచే కండ్లు

భ్రమింప జేయబడినట్టియు, భౌతిక యాం త్రికోప పరిజ్ఞాన జయభేరులచే చెవులు బధి రము గావింపబడినట్టియు, యీ కలియుగ మందు పూర్వశిక్షణాల గూర్చిన వాక్కు లందు పలువురు బౌద్ధికము యూహాపోషిత మగు వింతను మాత్రమే చూపించ గలు గుదురేగాని ప్రజ్వలించు రహస్య హృద యమును చేరజాచెదరనుట కవకాశ మతి స్వల్పము. వేద రహస్యము విప్పినప్పుడు కూడ రహస్యముగానే యుండగలదు.



# రహస్యవేత్తల సిద్ధాంత సంగ్రహము

## ఋగ్వేద భాగములు

"ఋగ్వేదము దాని భాగములయందంతయు నొక్కటే-అందలి పది మండలములలో మనమేది తీసికొన్నను ఒకే విషయమును ఒకే భావమును ఒకే సాంకేతికోపమానములను ఒకే పదజాలములను చూచెదము. ఋషులు కనుగొనిన దొకే సత్యము. దాని నభివ్యక్త పఱచుటలో నొకే భాష నుపయోగించెదరు. ఋగ్సంహితయందలి పది మండలములలో నారు మండలములు ఒక్కొకటి యొకే ఋషి

లేక ఋషిసంతతికి చేరినవి. రెండవ మండలము గృత్సమద ఋషి సూక్తములు; మూడవది విశ్వామిత్ర, నాల్గవది వామదేవ, అయిదవది అత్రి, ఆరవది భరద్వాజ, ఏడవది వశిష్ఠఋషులకు చేరినవి. ఈ మండలము లన్నిటియందు మొదలు అగ్ని సూక్తములు వాని వెంబడి ఇంద్ర సూక్తములు గలవు. ఇతర దేవతలగు బృహస్పతి, సూర్య, రిభు, ఉషలోనగు వారి సూక్తములతో మండలము ముగియును. తొమ్మిదవ మండలి పూర్తిగా సోమమును గూర్చిన సూక్తములు. ఒకటవ యొనిమిదవ

పదియవ మండలములు వివిధ ఋషిప్రోక్త ములు. కాని సూక్తము లన్నియు దేవత క్రమానుసరణిని మొదలు అగ్ని ఆవెనుక ఇంద్రుడును ఆపయి యితర దేవత లను గుఱించినవి. వేద సూక్తముల వరుసక్రమము నందొక నిర్దిష్ట భావ వికా సము చూడనగును. వేద సాంప్రదాయ మందు ఖ్యాతి గాంచినట్టియు, ఉత్తమ జిజ్ఞాసువులు, పవిత్ర గాయకులును అయిన ఋషులచే రూఢి పడిన సాంకేతికముల ద్వారా వేదమందలి సాధారణ భావము వివిధాంశములతో క్రమముగ వికసించు

నట్లు నిర్ణీతమైనదిగా మొదటి మండలము కన్పించుచున్నది. ఇంకను అధికమగు ఋషిసంఖ్యచే వేద భావమునందలి తుది పోకడలను కడు నూత్న భాషా కల్పిత సూక్తములతో చివరదియగు దశమ మండలము విరాజిల్లుట కేవల తటస్థ విషయమును కాదు. ఇందే పురుషసూక్తము కన్పట్టుచున్నది. ఆధునిక పండితులు బ్రహ్మవాదమునకు వేదాంత తత్త్వజ్ఞానమునకు మూలము నిందే కనుగొనుచున్నారు. అగ్నిని ప్రార్థించు ప్రథమ సూక్తము, ఇతర దేవతలతో సహా ఇంద్రునికైన రెండు

మూడు సూక్తములు, దృఢపఱుప బడిన సత్యమునుగూర్చిన కేంద్రభావమును సూచించుచున్నవి. మరుత్తులతో పొల్గొనిన యొకదానియందు తప్ప ఇంద్రుడు ఏక దేవతగయున్న మిగత యెనిమిది సూక్తముల యందు సోమ–గోవులు–నిరోధించు వృత్ర–వీని గూర్చిన సాంకేతికములును, మానవుని తేజస్సునకు గొనిపోవుటయందు ఇంద్రుడొనర్చిన మహాత్కార్యమును మనము కనుగొనుచున్నాము. కాన, ఋగ్వేదమందలి ఈ మొదటి పది సూక్తములు వేదము నాధ్యాత్మిక తత్త్వపరముగ

నన్వయించుటకు అతి ప్రధానములు.”
ముఖ్యముగా వీనిని, వీని కనుగుణ్యము
లగు నితర సూక్తములను పరిశీలించి శ్రీ
అరవిందులు వేద ఋషుల సాంకేతికము
లను అవి సూచించు భావములను రచనా
విధానము నిప్పటికి సుళువుగా మాత్రము
నిర్ణయించిరి.

ఈ రీతి ఋగ్వేదమందలి అంగీరస గా
థను అమూలాగ్రముగను అందలి ముఖ్య
సాంకేతికముల నన్నింటిని సాకల్యముగను
పరిశీలించి నిశ్చితాభిప్రాయమును తేల్చి
వ్రాసిన ‘రహస్యవేత్తల సిద్ధాంత’మను నీ

వ్యాసము కడు దీర్ఘమైన దగుటచే నందలి సారాంశమును సులువుగా గ్రహించుటకు శ్రీవారి సిద్ధాంతములు దీనికన్న భిన్నము లు కావని సూచించు భాగములను చిన్న అక్షరములతో చేర్చి వ్రాయుచున్నాము.

## భా షా స ర ణి

వేదమందలి భాష దైవప్రేరితమైనది. అది యదార్థము, ప్రస్ఫుటము, దృగ్గోచ రము, ఘనము అయినట్టి యనుభూతిని గాంచిన ద్రష్టలదే తేజస్వినులదే కాని సత్య మును భావ విశేషముగ మాత్రము గైకొ న్న జిజ్ఞాసువులది కాదు.

## లక్ష్యము — సాంకేతికములు

పాపమును బంధములను తిరస్కరించి త్రోసి వేయుటలో వేద మాసించినది ఆత్మోపలబ్ధి, సిద్ధి, అమృతత్త్వము. రహస్యవేత్తల సిద్ధాంతము అన్నిటి వెనుక అన్నిటి నతిక్రమించి అవేద్యము అనిర్వాచనమైన సత్య మొకటి కలదని గుర్తించుచున్నది. అది వ్యక్తిగతము కానప్పుడు 'తత్' 'ఏకం సత్' అనబడు చున్నది. ఆ సత్యము, దైవ మన్నిటికి మూలమే గాక అన్నియు నగుచున్నాడు. అతడే ఇంద్రాది విశ్వదేవతలును, క్రతువు వలన గల్గిన

ప్రజ, అశ్వము, యోధులును. మానవుని ఆత్మ హంసవలె భౌతిక మనోచేత నాకశములపై కెగసి మనకై యుత్తమ పరమ రహస్యమందు సచ్చిదానంద మూర్తియై వేచియున్న దైవమును చేరజూచును. అతడే మన ప్రియుడు, సచివుడు. సృష్ట్యాధారమునుండియు, పురుషాద్రియంతలి సోమలత నుండియు, స్రవింపజేసి అమృతానందమును జెంద మనము పానము జేయు దివ్యామృత మధుప్రదాతయును మూలమునగు నాతడు. ప్రాచీన రహస్య వేత్తలర్చించు భావరూపములివి కొన్ని.

## సృష్టియందలి లోకములు సూత్రములు

ఆ దైవము సృష్టిని కడు సంశ్లిష్టలోక సరణితో సృజించినాడు. మూ డధోలోకములు—స్వర్గము, భూమి, అంతరిక్షము; మూ డూర్ధ్వలోకములు—దైవముయొక్క ఆనందమయ లోకములు—సచ్చిదానంద లోకములు ; ఊర్ధ్వ అధోలోకములను సంధానముజేయు మూడు మధ్యలోకములు—సత్యం ఋతం బృహత్తులను అభివ్యక్తముచేయు నాకములు—తేజోమయ మగు త్రినాకములు. వీనిని గూర్చిన వేద ఋషుల భావము కడు గంభీరమైనది.

మానవుడు పృథ్వియందు జనించి మర్త్య లోకము మాత్రమే యెఱుగును. తేజో వంతమును గుహ్యము నయి దివ్య ధామం బగు చేతనాతీతోన్నత లోక మొకటికలదు. అటులనే సర్వమును జననంబొందుచున్న ట్లు కన్పించు నిశి—మనకు తెలిసినదానికి క్రిందనుండు అధశ్చేతనము లేక నిశ్చేతన ము-కలదు. ఈ తేజోమయమగు యూర్ధ్వ లోకములకును అంధకార బంధురంబగు నధోలోకములకును మధ్యనుండునదీ మన లోకము. మానవుడు పృథ్వి నుండి శరీ రము నెట్లో ప్రాణలోకమునుండి ప్రాణము

ను, మనో లోకమునుండి మనస్సును, గై
కొనుచున్నాడు. వానితో రహస్య సంబం
ధము గల్గియున్నాడు. తా నిచ్ఛగించినచో
శాశ్వతముగ ప్రవేశించగలడు వాని
యందు. సూర్య లోకములను చేరగలడు.
ఈ ఆరోహణము తనయందీ భూమిక
లుండుటవలననే జరుగగలదు. భూమిక
నుండి భూమికకతడారోహించుకొలది ఆ
తని జీవనకు క్రొత్త లోకము లున్మీలన
ములై యాతనికీ యాధ్యాత్మికానుభవము
కల్గును. ఒక్కొక యారోహణమును యొక
క్రొత్త భూమికయందలి జన్మయగు. దేవత

లీ లోక సరణిని విశ్వమందు సృజించి యుండుటచే ఆ తీరుననే వానిని మానవుని చేతనయందును నిర్మింతురు. మర్త్య స్థితినుండి యమృతత్త్వము వఱకు గల ఆరోహణమందు మనో చైత్యస్థితులే మానవునికి యుత్కృష్టమయినవి కావు. దేవతల సదనమయి మనస్సున కావల సూర్య తేజముతో వెలుగు కేవల సత్యలోకమునకు కూడ నారోహింప గలడు. అప్పుడతడమృతత్త్వమును జెందును.

మనదగు మర్త్యత్త్వమునకును మన మాకాంక్షించు అమృతత్త్వమునకును

గల భేదము వేద భావమును సాధనను విపులముజేయు సూచన యగుచున్నది. సచ్చిదానందము సృష్ట్యంతర్గత మూలము. మనము సత్తానందభివ్యక్తి గొంది ఇచ్ఛాజ్వాలతోడను జ్ఞాన తేజము తోడను ప్రకాశించి చేతన హర్మ్యలను దాటి శక్తిబల దార్ఢ్యములందు విస్తరించి ఆనంద మునందు సుస్థిరులమయి అప్రమేయ శాంతియందు ఆత్మ విముక్తత గాంచుకొలది అమృతత్త్వమును సాధింప గల్గుదుము. భూమం బగుట యే క్రొత్త జన్మ మెత్తుటయగు. అభీప్సతో కూడిన దేహధారి కష్టించు ప్రాణమయుం డగు. ఆతడు మనోమయ చైత్య పురుషుడగా మారు. ఈ జిజ్ఞాసి విశ్వమయుం

డగు. విశ్వమయుడు ఘనతర శాంతి ఆనంద సమరసములగోరు ఆధ్యాత్మకుడగు. వీరై దుగురు ఆర్యజాతికి చేరినవారు. అతీతాద్యము చేరజూచు కేవలార్యుడునూ గలడు. ఈ అంతఃపరివర్తనమంతకు కారణ భూతము పరమనస్సత్యము. అయ్యది తేజోవంతమగు దృష్టిని దివ్య చక్షువును మనస్సుకు బదులుగా నొసంగు. అనిత్యమైన ప్రాణమును ఆనంద ప్రాణాభరితముగ మార్చును. మృత్యుబద్ధమైన శరీరమును స్వేచ్ఛామృత చైత్యపురుషునిగ చేయును. కాన మానవ వికాసము మొదలు సర్వ

త్రాకిశులను భరింపగల ప్రాణ విస్తరత నిర్మల మనస్సు శుద్ధచైతన్యము గల్గియుం డుట యగును. రెండు మానవుని తేజో శక్తులు అనంత సత్యముగ అమృతేచ్ఛలు గ మారుటయే. మన సాధారణజీవన అంధ కార మయమైన నిశి. సత్యసూర్యు డుద యము కాబోవుతరి ఉషస్సాగమనంబగు.

## యజ్ఞము

ఉషస్సు వెంబడి క్రతువు ప్రారంభించు. క్రతువువలన ఉషస్సును నష్టసూర్యుడును పునరావృత్తియగు నిశియందుండి జయింప బడుదురు. యజ్ఞమువలన అన్నిటిని చుట్టు

కొని నిరోధించు వృత్రాసుర బంధములను దివ్యమనోవిద్యుతులచే ఛేదింపబడుటవలన నాకవర్షములును ఉత్తమ సృష్టియందలి సప్తపోధారలును క్రుమ్మరిల్లగలవు. ఈ మన యజ్ఞము సృష్టియందలి ఉత్తమశక్తులకు మన లాభములను క్రతువుల నొసంగుటయే. జగత్తంతయు యజ్ఞమే. హృదయమునుండి తేజోవంతమగు సూక్తి వెలువడవలెను. సూక్తిచే దేవతల నాహ్వానించి ప్రతిష్ఠించి ఈ శరీరమునందు వారిని పెంపుజేయవలెను. సూక్తిచే సూర్యుడు సర్వమును సృజించును. బ్రహ్మణస్పతి

ఆహ్వానించును. తృప్తిని రూపొందించును. జిజ్ఞాసువు స్ఫూర్తిని కనుగొని తన పూర్ణతను నెలకొల్పును. విరోధుల పరిమార్చు దేవతలకు తోడ్పను. తన ప్రకృతిని వికలత నొందించు అధ్యాత్మక వైరులంత చంపబడుదురు.

క్రతువు కొన్నివేళల యాత్ర యానమని వర్ణింపబడుచున్నది. దివ్యేచ్ఛయొక్క జ్వలించు వీర్యముచే నది దుర్గమ మయిన సత్య మార్గమున ఆనందముతో నడువవలెను. ఇది సహకారులగు సురలయొక్క విరోధులగు అసురులయొక్క పోరాటమే.

దేవతలు భగవంతునియొక్క వివిధశక్తు లు. వీరు విశ్వమును సృజించి తామందు అభివ్యక్త మగుదురు. మానవుని తమ సోదరునిగా గ్రహించి తమతోడి సాంగత్య మున కాహ్వానింతురు. అతనిని తమ తేజోమయమగు కూటమికి తీసికొనెదరు. బదులుగా మానవుడు వారిని యజ్ఞమున కాహ్వానించి తన వేగములను గుణములను, నిర్మలతలను ఘృతమును, మధువులను ఆనందలత రసమును, అర్పించును. వారిని, వారొసంగు ఫలములను తనయందు స్వీక రించి సూక్తిచే సోమముచే వృద్ధినొందించి

దైవత్వమందు సిద్ధిగాంచును. ఈరీతి వేద
సాంకేతికములందలి కీలకము తెలిసికొన్న
చో చక్కగా నర్థము చేసికొనగలము. ఋ
షుల కీదేవతలును అసురులును కేవల భావ
రూపములే గాక ప్రాణయుతమగు నిజరూప
ములు. మానవుని జీవితము జగత్సూత్ర
భావములను మూర్తీభవించి పోషించు
విశ్వశక్తులపోరె అగుచున్నది.

## దేవతలు

క్రతువే దేవతలకొఱకు? మానవునియం
దు ప్రవర్ధమానంబగు దైవమునువ్యక్త ప
ఱచి రక్షించుటకెవరి నాహ్వానించవలెను?

మొదలు అగ్ని. జ్ఞానముతో కూడిన దివ్యేచ్ఛ. ఇతను లేనిదే జీవుని వేదికయందు యజ్ఞజ్వాల ప్రజ్వలింపదు. తర్వాత ఇంద్రుడు. శక్తితో కూడిన తేజము. ప్రకాశవంతములగు నశ్వములతో దివ్యమనస్సు ఈ లోకమందు ప్రవేశించి అజ్ఞానాంధకారమును ఛేదించును. ఆ పయి సూర్యుడు-పరమ సత్యాధినేత—తన తేజోమయమగు మండలతో ఉషస్సువెంబడి మనయందు ప్రవేశించి నిశిబద్ధమయిన దానియందు పరమానందము వరకు గల భూమికల నొకదానివెంట నొకటి వ్యక్త

ము చేయును. ఆ వెనుక సోమ—ఆనం
దాశి దైవము. ఆనందము పృథివిపై
పెరుగువాని యందును జీవనాపస్సుల
యందును దాచబడియున్నది. మన శరీర
మునందుకూడా. దానిని మనము స్రవింప
జేసి దేవతల కర్పించి వారలను వృద్ధి
పొంచి మనము జయించవలెను. సూర్యు
నికి సహాయులుగ వరుణ—పాప విచ్ఛేది
యగు విపుల నిర్మల విశుద్ధత; మిత్ర—
చింతనక్రియ ప్రేరణల సమరస మొనర్చి
నడపించు ప్రేమశక్తి; ఆర్యమ—నిర్మల
వివేకముతో కూడిన అభీప్స - ఉద్యమము

ల పూర్ణత ; భగ-పాపము, స్ఖాలిత్యము బాధ వీనిని తొలగించి సర్వ విషయము లను చక్కగా ననుభింపజేయుశక్తి ; అను నీ నల్గురు గలరు. సోమమువలని యానంద మును మనము భరించునటుల యకుంఠి తము ప్రకాశవంతము అయినదిగ మన మనఃప్రాణ శరీరముల సిద్ధపఱచు అశ్వి నులు. దివ్య మనస్సగు ఇంద్రునికి మనో రూపములు కల్పించుటయందు సహకారు లగు ఋభులు. వీరు ఇంద్రుని గుఱ్ఱములను అశ్వినుల రథమును దేవతల ఆయుధము లను యాత్రికు యుద్ధమునకు కావలసిన

ఉపకరణములను తయ్యారు చేసెదరు. అక్లే మరుత్తులును. చింతనము వాక్కు వీని వెనుకనుండి వానిని ప్రేరేపించి సత్య తేజానందములకై పోరాడెదరు. మాహి-దివ్యమూలమునుండి సర్వమును బయల్పుఱచు శక్తి; ఇల-ప్రాణయుత మగు దృష్టినిగల్గించు ఆదివాక్కు; సరస్వతి— దేవప్రేరితమైన ఉక్తిప్రవాహము; సారమ-అధశ్చేతన గుహయందు దాచబడిన వెలుగులను కనుగొను స్వర్గశ్వానము. దక్షిణ-క్రతువును హవిస్సులను చక్కగా పరిశీలించి ఆయా దేవతలకు పంచిపెట్టు

నది. ఈ అయిదును సత్యచేతన యొక్క శక్తులు. ప్రతి దేవతకు యాతని స్త్రీశక్తి కలదు. ఈ క్రతువు—పోరున—కాధార మైన మనో నాకమను తండ్రియు; జడ మగు భూమాతయు; మనసో శరీరముల జతనంబొనర్చు ప్రాణంబగు వాయువును, నాకవర్షముల నిచ్చు పర్జన్యుడును, దివ్య యుద్ధాశ్వ మయిన దధిక్రావనయు ను, మూడవ భూమిక యందు త్రిపురుషముల పూర్ణముచేయు త్రితాపత్యయు యింకా అనేకులు దేవతలు కలరు.

మన సిద్ధి ఈ దేవతలందరు వికాసము

జెందిన నేకలుగ గలదు. ఈ సిద్ధి అన్ని భూమికలందును గలుగవలెను. శరీరము నందు ప్రాణమునందు మనస్సునందు హృద యమందు కలిగిననే పరివర్తనము జరుగ గలదు. ఆ తీరున సత్యాధీనతయు సత్యము వలన ఆనందమును దానిచే కైవల్యమును గల్గును. పురాణ ప్రసిద్ధములగు త్రిమూ ర్తుల మూలమగు మువ్వురు దేవతలు ఈ యూర్ధ్వ పరిణామమునకు తోడ్పడుదురు. బ్రాహ్మణి స్పతి—సూక్తిచే సర్వమును సృజించును, వ్యక్తము చేయును. రుద్ర- సృష్టిని పైకెత్తి, విరోధించుదానిని కొట్టి

వేసి, అద్భుతగులుదానిని త్రోసివేసి, ఘాతి జెంది బాధపడుదానిని శరణుజెందిన దానిని రక్షించును. విష్ణు—సర్వవ్యాపియై లోకముల భరించును. మర్త్యులందు ఇం ద్రుని పనికెడు మిచ్చును. అతనితో నతని వలన మన కొఱకు నెచ్చెలి ప్రియుడును సుందర దైవముగను వేచియున్న ఆతని ధామమునకు మనము చేరెదము. నిశ్చేత నాబ్ధినుండి ఉత్తమరూపములతో స్వర్గము నకు తలయెత్తు శిఖరములతో మనభూమి నిర్మితమైనది. మనో స్వర్గము విద్యుల్లతలను ప్రాణము నిచ్చు అపస్సులతో కూడిన

మేఘములను గల్గియున్నవి. అధఃచ్చేతన నుండి స్వచ్ఛందమగు వాహీనులు ఊర్ధ్వ పరమ చేతనకు ఆరోహించును. ఈలా భౌతిక ప్రకృతి రూపములతో నాధ్యాత్మిక భావములను ఋషులు వర్ణించిరి. ఈ ఆరోహణమును మన పూర్వులిదివరకే సాధించియున్నారు. వారు తమ సంతతికి తోడ్పడ సిద్ధముగా నున్నారు.



# ఈశోపనిషత్తు

"ఈశోపనిషత్తు శైలియందును భావ పోషణయందును తప్పక ఛాందోగ్య బృహదారణ్యములకన్నను చాలావఱకు తైత్తిరేయ ఐతేరియములకన్నను వెనుకటిదియై కడు పూర్వ వేదాంత రచనలకు చేరి యున్నది. కాని, ఛందోబద్ధమైన యుపనిషత్తులలో నిది యత్యంత ప్రాచీనమైనది. ఉపనిషత్తులు రెండు మహా యుగములకు చేరినవి. మొదటిదియగు పూర్వయుగము

నకు చేరినది వేదమూలములకు దగ్గరగ నుండి వేదఋషుల చైత్యభావ విధాన మును ప్రతి ఫలించుచూ వ్యావహారి కాధ్యాత్మికతను కాపాడుచు వచ్చినది. ఈవలి యుగమునకు చేరిన రెండవదాని యందు భావరూపములు నవీనమై ఆద్య సాంకేతికముల కఠీన సంబంధములు లేక వేదభావ తత్త్వముల ముఖ్యాంశములను వదలుటకు ప్రారంభించి అలౌకికము సన్న్యా సాత్మికమగు ఈవలి వేదాంతమునకు పునాదియైనది. ఈశ మొదటిదియగు వేద గణమునకు చేరినది. తీవ్ర మాయవాది

నైన శంకరుల కిదొక్క టే దాటరాని కష్టముల గలిగించినది. ద్వంద్వములను సమరస మొనర్చుటయే దీని యందలి ముఖ్యోద్దేశ్యము. జీవనలక్ష్యమగు అమృతత్త్వమునకు ఈలోకమునే క్షేత్రముగ గైకొనుచున్నది. శరీరధారియగు నీ మానవుని యందే ఇక్కడనే సాధనానుభవములకు శరీర-జీవన-సన్యాసముతో నక్కర లేక సర్వలోకములు సదత్తులు జీవన మరణములు అమృతత్త్వము యున్నటుల భావించు ప్రాచీన వేద సాంప్రదాయముతో నేకీభవించుచున్నది. ఈ భావమెన్నడును

హిందూ తత్త్వ సిద్ధాంతములనుండి తుది ముట్టి పోలేదు కాని వ్యవహారికమును త్యజించుటయే స్వేచ్ఛావిధిగను ప్రశంస నీయమైన యొకే లక్ష్యముగను యధిక ముగ నొక్కిచెప్పు మార్గమును యెదు రొక్కనలేని రెండవ పక్షముగ తేలినది.

''పరమబ్రహ్మ సత్యముతో జగత్తు జీవన కర్మలు మానవావధి వీని యన్నిం టికి గల సంబంధము గూర్చిన సమస్యను పరిశీలించునది ఈశోపనిషత్తు. సంగ్రహ మైన పదునెనిమిది మంత్రములలో జీవన మూల సమస్యల చాలావర కన్నింటి,

పరమాత్మ ఏతత్ సంభూతములు, పరమే
శుడు యాతని వర్తనములు ఈసర్వమును
విశదపఱచు కీలకముగ శీఘ్రగతి పరిశీ
లించినది. ఇందలి ఉద్దేశ మన్యోన్యాను
రూపమగు సరళితో కూడిన క్రమానుసార
ములగు నాలుగు భావ పోకడలయందు
విపుల పఱుపబడినది.

ప్రథమ సంచలనము.

చలనము చలనరూపములతో కూడిన
జగత్తుయందు వశించి పరిపాలనజేయు
నేకము సుస్థిరమగు నాత్మతో మొదటి

దానియందు పునాది యేర్పఱుప బడినది.
(1మం-1పా)

ఈ భావమును పురస్కరించుకొని మానవునికి దివ్యజీవన విధానము సూచింప బడినది. ఆశను బహిష్కరించి సర్వమును త్యజించుటచే సర్వమును యనుభవించుట; కోర్కెలేక సర్వమును ఈశ్వరునకు చేరినది, ఇది ఈశ్వరునికైన ఈశ్వరుని నభివ్యక్తముజేయు కేంద్రమను భావముతో నన్నియు యనుభవించుట. (1మం-2పా)

బహుళంబగు జగద్వర్తనము మధ్య ఈశునితో నేకమయి ఆత్మయొక్క అనన్య

పనయనంబయిన స్వేచ్ఛను మూలముగా గొని భౌతికజీవన కర్మముల సమర్థించు ట నుద్ఘోషించినది. ఇతరంబనుదృష్టి లేక ఈశ్వరునితో నేకత్వముగాంచిన కర్మ లంటుకొనవు గనక నరుడు జీవప్రమాణ మగు నూరేండ్లు సర్వ కార్యములను జేయుచు ఇక్కడ జగత్తునందు జీవించ వలెనని నొక్కి చెప్పుచున్నది. ఇదే దివ్య జీవనము. (2మం.)

జగత్తునం దేకంబగు నీశ్వరు డభివ్యక్త మగుటయందు తెలివిలేక ప్రవేశించిన, అడ్డుతగిలినదానికి ఫలము మరణించి అంధ

కార బంధురంబగు స్థితియందు చిక్కు
వడుటయని చివరకు ప్రకటించినది—
ఆత్మతో నైక్యత జెందక నాత్మను త్యజిం
చు వారు యీ లోకములు చేరుదురు.

(ఈశం.)

రెండవ సంచలనము.

దీనియందు మొదటిదాని భావములు
పునర్గృహీతములై విపులము జేయ బడినవి.

ఎవ్వడు సర్వమును తనయందు గల్గి
తా నన్నిటియం దున్నాడో, ఏకత్వము
అచలనము ఎవని యున్నతతర సత్యమో,
ఆ ఏకమగు బ్రహ్మమును—ఈశుడును—

బహుళమయిన జగత్తును యభేదములని చూపించినది. (4–5మం.)

దేనివలన మనుజుడు తనను విశ్వ,ఆద్య ఆత్మలతో నైక్యతం గాంచునో తనయం దాత్మచే నద్దాని సంభూతులనెల్లను దుఃఖ మోహ వివర్జితుడై గాంచునో ఆ యేక త్వాను భూతియందు జీవన విధాన మూలము పరిసమాప్తియు కనుగొనబడు చున్నవి. అనగా యెల్లజీవనకు మూలము ఆత్మ–బ్రహ్మము. జన్మసాఫల్యము తనయం దు బ్రహ్మమును తత్సంభూతములగు నెల్ల జీవులతో విశ్వముతో సహా దుఃఖము మో

హాము లేక జూడ గల్గుటయే. (6-7మం.)

మూడవ సంచలనము.

దీనియందు జీవనను కర్మములను సమర్థించు భావమునకును వాని దివ్య పరిపూర్ణత సూచనకును మరలుచున్నది.

జగత్తునందును ఏకమగు పురుషుని సంభూతములందును ఈశుని ఆత్మాభివ్యక్త పథములును స్థితులును నిర్దేశింపబడినవి. ఆతని సంకల్పేచ్ఛల వలననే సృష్టియొక్క యంతర్విధి యేర్పడినదని యుద్ఘోషించుచున్నది.

అనగా బ్రహ్మమునందుండి వ్యక్తమగు నీ జగత్తునందలి యెల్ల స్థితిగతులును ఆ బ్రహ్మముయొక్క సంకల్పము యిచ్ఛల వలననే బహుకాలముగ నడుచుచున్నవి.

(౧౫ం.)

విద్య అవిద్య ; సంభూతి వినాశములు.

మృతత్త్వమునుండి అమృతత్త్వమునకు ముందుకుజను, యుపక్రమించు, క్రమాభి వృద్ధిగాంచు ఆత్మోపలబ్ధి కీ రెండునుకలసి సహాకారు లగుచున్నవని సమర్థింపబడినది. అనగా ఈ లోకమందలి జీవనము ఎక్కడ నో యుండు లోకమందలి జీవనకే పీఠిక

యను సూచనను తొలగించి జీవన లక్ష్యమగు అమృతత్త్వమునకీ జీవనయే క్షేత్రముగా జేయుచున్నది. (9–14మం.)

నాల్గవ సంచలనము.

ఇందు సూర్య అగ్ని సాంకేతికముల ద్వారా పరమసత్యలోకము అమృతత్త్వ లోకములను భూమికలను గూర్చిన భావమును తిరిగి చెప్పుచున్నది. (15–16మం.) ఈజన్మమందలి ప్రక్రియలను (17మం.) మరణానంతర స్థితిని (18మం.) సాంకేత రూపమున సూచించుచున్నది.

ఈశ్వరునియందుండి ఈశ్వర సంకల్పే చ్ఛల వలన నిరంతర మావిష్కార మగు చున్న దిదంతయు గాన నేను నాది యను భావమువదలి ఈశ్వరునితో నైక్యతంగాంచి సర్వమును జుగుప్స లేక యనుభవించుచూ తనయందాత్మయే యెల్ల జగత్తులో సంభూతి గాంచినదని దుఃఖ మోహములు లేని యనుభూతి జెంది జీవనను దివ్య జీవనగ పరివర్తన మొనర్చుటేయను నీ యుపనిషత్తుయొక్క ముఖ్యప్రభోదము శ్రీఅరవిందుల సిద్ధాంతమును ధృవపఱచుచున్నది.



# కేనోపనిషత్తు

"బ్రహ్మ చేతనకును మనో చేతనకును మధ్యగల సంబంధమును విచారించుచున్న దీయుపనిషత్తు. భౌతికమునందు పనిచేయు ప్రాణశక్తి మనో శక్తులచే వ్యక్తమగునట్టి జడముకాని సూక్ష్మ శక్తులు దేవతలు. ఆశ్చేర శక్తుల నతిక్రమించి వానిని భరించుచు వానికన్న భూమంబగు యాత్మ—బ్రహ్మము—యొకటి కలదు. శారీరుల మగు మనయందది సూక్ష్మరూపముతో

నుండు అధిదైవతము స్థూలమగు అధి భూతమున కన్న వేరైనదియై మనఃప్రాణ ములచే సూచింపబడుచున్నది. మనఃప్రాణ ములయందు దేవతలకు స్వాభావికమగు ప్రక్రియ లభించుచున్నది. ఉపనిషత్తు అధి దైవతము అధ్యాత్మములకు గల సంబంధ మును విచారించుచున్నది. విశ్వదేవతలగు ఇంద్ర–వాయు–అగ్నులచే మనస్సు ప్రాణము వాక్కు ఇంద్రియములు నియతంబగు చున్నవి. ఈసూక్ష్మ విశ్వశక్తులే సృష్టికి మూలములై మనఃప్రాణములను నిజముగ సంచలింపజేయుచున్నవా? లేక వాని

కన్నిటి వెనుక యొక్కటియై నైక్యపఱచు ఉత్తమ శక్తి కలదా యని ప్రశ్నించు చున్నది యుపనిషత్తు. సృష్టికి వెనుక నట్టి మహాత్తరశక్తి గలదని బదులిడుచున్నది.

శరీరధారియగు జీవి మనస్సునం దభివృద్ధి-వికాసము-గాంచినప్పుడే మనోమయుడై మనఃప్రాణశరీరములను గుర్తించును. మనస్సారీతి తన వెనుకనుండు దాని నెఱుంగదు. కాని అది మనస్సు నెఱుంగు. మనోమయుండగు పురుషుడు దాని రూపములనుండి తన నిజాత్మను విముక్తమైనదిగ జేయగనే అది తానని ఎఱింగి దానిచే

మనస్సుకన్న యెక్కువ సత్యమైన దానికిని మనస్సునకును గల వాస్తవ సంబంధమును కూడ గుర్తించును. మనస్సును దాని యుపకరణములును దాటి తనయందు బ్రహ్మమునందు ప్రవేశింపగల్గు టెట్లునది మనోమయ పురుషునకు పరమ లక్ష్యమగు నంత–సృష్టియం దన్నిటికన్న ముఖ్యమగు సమస్య యగు: మనఃప్రాణశరీరములు కన్న మహత్తరమైన దొకటి కలదనినయెడ మనుజులిక్క డుపాశించి, వెంబడించు రూపానుభవములతో కూడిన జీవనము మాత్రము ప్రబోధముగాంచిన జీవి ఆశిం

చు ఫలము కానేఱదు. మృత్యుమయమగు
నీలోకమునుండి విముక్తిగాంచి దానికావల
నుండు తన స్వధామమగు అమృతత్త్వము
ను బడయవలెను. కాని ఈ బ్రహ్మచేతన
సాక్షాత్కారము భౌతిక – మనోలోకము
లకు భిన్నమై వానికి వాని చర్యలకు
సంబంధములేక యుండలేదని యుపనిషత్తు
చెప్పుచున్నది. బ్రహ్మ జగదీశ్వరుడు.
మర్త్య చేతనమందలి దైవశక్తులతనివి.
బ్రహ్మము పోరి జయించుట వలననే
వీరికి జయముకలిగి వృద్ధిజెందిరి. దానికన్న
అధిక సత్యమును ఆనందోత్కృష్టమును

పరిపూర్ణము నేది యగుచున్నదో అద్దాని బాహ్యాల్ప ప్రవర్తనమే జగత్తు. అయ్యది యనంతము అమృతశక్తిమయమగు ఆనంద ము. విశుద్ధము కేవలమగు ఆ యానంద మునే మనుజు లన్వేషించి యుపాసింప వలసినది. ఈ లోకమందలి కోర్కెలను కాదు. తన సర్వకోశములయందు దానిని వెంబడించుటయే యేకైక సత్యము. యే కైక జ్ఞానము. ఈ జ్ఞానము నెవ్వరెఱింగి సర్వ భూతములయందు జూచెదరో వా రమృతత్త్వమును గాంతురు. వారిని యెల్ల భూతములు వాంఛించును. ఈ జ్ఞానమునకు

తపస్సు, ఆత్మనిగ్రహము, కర్మలు పునాదులు; వేదములు అంగములు; సత్యము యునికిపట్టు. ఈ జ్ఞానమును పొందినవాడు పాపమును ఛేదించి విపులము అనంతమగు మనో స్వర్గములోను అంతకుపైనుండు యుత్కృష్ట లోకములోను ప్రతిష్ఠింపబడును. సర్వభూమికల యందు అమృతత్వమును బడయును.

ఉపనిషత్తునందలి భావ మిదియగుటచే నిది శ్రీవారి సిద్ధాంతముల నెంతేని ధృఢపఱచుచున్నది.



# తైత్తిరేయోపనిషత్తు

ఇది వెనుక చెప్పినట్లు వేదగణమునకు చేరినది. ఆర్య-5-వ సంపుటియందు బ్రిహ్మావల్లియందలి మొదటి మంత్రభాగమునకు మాత్రము శ్రీవారు అనువాద వ్యాఖ్యానములను ప్రారంభించిరేకాని ఈ కార్యమును పూర్తి చేసియుండలేదు. శ్రీవారి సిద్ధాంతములు ప్రాచీనవేదాంత సిద్ధాంతములకన్న భిన్నములుకావని నిరూ

పించుట కిదెంతయు సహకారి కావున సూక్ష్మముగ దీని నిందు పరిశీలించుచున్నాము.

"బ్రహ్మవిదుడు సర్వము నెఱింగిన బ్రహ్మతో సహ సర్వ కామములను పొంద గలడు. అనగా నిత్యానందములయం దైక్యతం గాంచుటయేగాక ఆత్మసంపూర్ణతానందము నందు ఉత్కృష్టాత్మజీవనను పొంది వ్యక్తిగతుడైన యాత్మ కోర్కె రూపమున తా నన్వేషించుచున్న సృష్టి యందలి పరమార్థ పూర్ణవికాసమే యగు ఆనందము ననుభవించుటయం దైక్యతం గాంచును.

"అధ్యాత్మంబగు నా బ్రహ్మమునుండి సూక్ష్మము స్థూలంబయిన భౌతిక పదార్థము క్రమావరోహణంబు గాంచి యందుండి యోషధులును వాని యందుండి అన్నమును వాని యందుండి పురుషుడును క్రిమారోహణగతి ప్రభవించినవి. ప్రాదుర్భూతమైనవి. ఈ అన్నరసమయ పురుషుని యందు ప్రాణమయుడును ప్రాణమయ పురుషునియందు మనోమయుడును వానియందు విజ్ఞానమయుడును వానియందు ఆనందమయుడును నిండి అంతర్వ్యాలీనంబులయి యున్నారు. అనగా ఈ శరీరము

నందే ఈఆకాశము లీ పురుషులతో సహా ప్రతిష్ఠితములై యున్నవి. దేవతల స్వాభావిక విచేష్టా చిహ్నములే మనః ప్రాణములు. విజ్ఞానము సర్వమును, యజ్ఞమును, కర్మను, రూపొందించుచున్నది. అదే సత్యము ఋతము బృహత్తు. మనఃప్రాణశరీరములను ఉత్కృష్టానందము నకు సంధాన మొనర్చునది. బ్రహ్మము తా ననేకము కావలెనని ఇచ్ఛగించి తపస్సు-శక్త్యాయుతము-చేయుటచే ఇదంతయు సృజింప బడినది. సూక్ష్మ స్థూలంబయిన భౌతిక పదార్థమును అందుండి క్రమముగ శరీర ప్రాణ

మనస్సులు వికాసము చెందినకొలది ఆత్మ ప్రకటితమగుచు ద్వంద్వము లేర్పడినవి. కాని, ఇవన్నియు నా సత్యమే. ఏలన మొదలు బ్రహ్మ మసత్తుగాయుండి సూక్ష్మాతి సూక్ష్మంబయి రూప రహితంబయి యుండె దానియందుండి తన స్వభావముచే తనవలననే ఇదంతయు చక్కగా రసవంతమైనదియై, ఆనందముతో కూడినదై, ప్రభవించినది. ఇట్లు సృష్టికిని బ్రహ్మమునకు అంతరము లేదని ఎవరు తెలిసికొనునో వానికి భయము లేదు. అంతరమును చూచువాడు, రెండును వేరని తెలిసికొను

వాడు, భయమును పొందుచున్నాడు. ఏ ఆనందము వలన సర్వమును చరించు చున్నదో ఆ యానందము అధికా ధికోన్నతము. ఆ ఆనందమయ పురుషుని ఎవడు తెలుసుకొనుచున్నాడో వాడు అన్నమయాది ఆనందమయఆత్మలను పొం దుచున్నాడు. అన్నియు నిక్కడ గలవా డగుచున్నాడు. పుణ్యము చేయలేదని గాని పాపమును చేసితినని గాని దుఃఖిం చక ఆ రెంటిని ఆత్మానుభూతి కైనవని ఎఱుంగును. ఇది యానందవల్లి యందలి భావము.

బ్రహ్మ మెట్టిదని ప్రశ్నించగా వాక్కు చక్షుశ్శ్రోత్రాది ఇంద్రియములను మనః ప్రాణ శరీరములను గల యీ భూతములు, ఇవి ఎవనివలన పుట్టి ఎవనివలన జీవించి ఎవని యందు లయమగుచున్నవో అదే బ్రహ్మమని జిజ్ఞాస చేయుమని తండ్రి చెప్పగా భృగువు తపస్సుచేసి మొదలు అన్నమును—శరీరమును—బ్రహ్మమని తెలిసికొని తండ్రికి తెలియజేయగా నతడు తపస్సే బ్రహ్మము. తపస్సుజేసి బ్రహ్మను తెలిసికోమనెను. అంత ప్రాణము బ్రహ్మ మని తెలిసికొని తండ్రిని యడుగగా

తిరిగి తపస్సు చేయమనెను. మనస్సును బ్రహ్మమని తెలిసికొనెను. తండ్రిచే నియతుడై యావల విజ్ఞానమును బ్రహ్మగా నెఱింగెను. తిరిగి తండ్రి తపస్సుచే బ్రహ్మ జిజ్ఞాస చేయుమనగా తపస్సుచే ఆనందము బ్రహ్మమని తెలిసికొనెను. ఇట్లు వారుణిచే ప్రేరితుడయి భృగువు తెలిసి కొనినది హృదంతరాళమున 'బుద్ధిగ్రాహ్యమై అతీంద్రియమైన' బ్రహ్మవిద్య. బ్రహ్మము నీవిధముగ తెలిసికొనినవారు అన్నాదికమును, శరీరము ప్రాణము మనస్సుల మహత్తును, మహః–విజ్ఞానమును, సచ్చిదానందములను

గలవాడగును. బ్రహ్మము నెఱింగినచో బ్రహ్మాభి వ్యక్త్యోపకరణములగు శరీరాదికము విస్తృతంబగు. కావున శరీరమును నిందించకూడదు. శరీర ప్రాణము లన్యోన్యాశ్రయములు; శరీరమును త్రోసివేయరాదు. జలాగ్నులు రెండును ఒకటి వలన నొకటి కలిగినవి. ఇవే భూమియు అగుచున్నవి. భూమి, జలము, అగ్ని, వాయువు లొకటినుండొకటి కల్గుచున్నవి. శరీరము విస్తరించినది గావలెను. ఆకాశము పృథ్వి అయినది. అనగా ఆకాశము వాయువు అగ్ని జలము భూమి క్రమముగా

బ్రహ్మమందుండి యేర్పడినవి అని తెలిసి కొనిన శరీరాదికము విస్తృతంబగు. ఇట్లు తెలిసికొనిన అన్నమయాత్మను ప్రాణ మయాత్మను మనోమయ ఆత్మను విజ్ఞాన మయ ఆత్మను ఆనందమయ ఆత్మనుపొంది ఈలోకములందు కోరినరూపము గలవాడై నేను శరీరిని, యితర కోశములునూ నావి, సూక్తిని నుడువువాడను నేను, ఋతమందు పుట్టినవాడను, దేవతలకన్న పూర్వుడను, అమృతనాభికల వాడును, న న్నమృతము గ నితరుల కొసంగుచున్నాడో నన్ను పోషించుచున్నాడు. నేను అన్నమును తిని

హరించబడుచున్నాను నేను విశ్వాతీతు డను సువర్ణజ్యోతిని అని గానముచేయుచు సంచరించును. అని భృగువల్లి ముగియు చున్నది.

కావున తైత్తిరీయమునందు బ్రహ్మమే ఆనందేచ్ఛవలన రూప నామాత్మకమైన సృష్టిగా ప్రథమమున జడ పదార్థమునం దవరోహించి అన్నమయాదికోశ-ఆత్మలుగ ఆనందమయము వఱకు క్రమాభివ్యక్తము గాంచుచున్నాడు. మనదగు మనోమయమే ఈ పరిణామమందలి తుది ఘట్టముకాదు. విజ్ఞానమయమందును తద్వారా ఆనంద

మయ మందును విస్తరించి అన్నిటియం దిక్కుడనే వ్యవహరింపవలెను అని సూచింప బడినది. కాన శ్రీవారి సిద్ధాంతమును మిక్కిలి ధృవపఱచుచున్నదిది. నారాయణవల్లియందలి కడపటి యనువాకము క్రతువు—యజ్ఞము—నేరీతి తత్త్వసాంకేతికముగ నెఱుంగవలసినది తెలుపుచున్నదికాన శ్రీవారు "వేద రహస్యము" నందు రచించిన సాంకేతిక విధానమునే వేదగణమునకుచేరిన యీ యుపనిషత్తును సూచించుచున్నది.



# గీతా వ్యాసములు

"మానవు డాచరించు కర్మలను చేయు పనులను గురించిన గూఢప్రశ్న విషయమే "గీత"యందలి భావము ఆదినుండి. జగ ద్వ్యర్తనములందు నిమగ్నులమయి సర్వో త్కృష్ట పదమగు బ్రహ్మమునందా రూఢు లమయి నిలువగల్గుటేలా? యను గడ్డు సమస్యయై తోచు దుర్ఘట విషయమును గూర్చినదే. ఈ విషయమునే పదునెనిమి దవ అధ్యాయము యొక్క చివర భాగ

మున 45-నుండి 66-వఱకు గల 22-శ్లోకములలో గీతా ప్రబోధమందలి కేంద్ర భావముగ తా నెన్నుదానిని గీత విపులము జేయుచున్నది. సన్యాసమార్గము ప్రయోజనకారి కాదని గీత యెన్నడును భావించదు. కాని యా మార్గము సమస్యను తేల్చుటకన్న తెగవేయుచున్నదని గుర్తించి దానినంత గుణవంతమైనదిగ నెన్నక తాను సూచించు మార్గమును శ్రేష్ఠమైనదిగ గణించుచున్నది. రెండు మార్గములునూ స్వాభావికముగ అజ్ఞానుడైన మనుజుని విశుద్ధాధ్యాత్మ చేతనకు

తీసికొనిపోగలవు కాని దేనిని సమర్థింప జాలక మరలుచున్నదో ఆ సన్న్యాసమార్గ మున కన్న గీతా మార్గము జీవి ప్రకృతు లను ఆత్మయందైక్యత యొనర్చి సమర్థించి మానవుని దైవత్వమునందు సంపూర్ణునిగ జేయుచున్నది.

"సిద్ధి, స్వభావ, స్వధర్మములు 45–48 శ్లోకములలో చెప్పబడినవి ; ప్రతిజీవుడును తన స్వభావజనిత కర్మలయం దభిరతు డయి సర్వభూతములు ఎవనియందుండి జననం బగుచున్నవో ఇదంతయు నెవనిచే నిండియున్నదో ఆతనిని స్వకర్మలచే నర్చిం

చిన సిద్ధిని పొందగలడు. సిద్ధి అనగా తన యందు గల భగవంతు నభివ్యక్తము జేసి జగదీశ్వరునితో నైక్యతగాంచి, చేతన, జ్ఞాన, ఇచ్ఛ, ప్రేమ, ఆనందములతో పరమాత్మనందైక్యము గాంచుటే. జీవుని యందలి యున్నతాధ్యాత్మిక శక్తి క్రమాభివృద్ధిగ దివ్య సత్యమును వ్యక్తము జేయ జూచు క్రియా విశేషమునందు స్వభావము స్వధర్మము లసూత్రము ఇమిడియున్నది. కాన ఇతరుల ధర్మమునకన్న గుణహీనమైన దైనను స్వధర్మమే నరుడాచరింపతగినది. స్వభావనియతమైన కర్మ చెడ్డ

దైనను చేయుటచే పాపమును జెందడు. తప్పితమైనదైనను సహజమైన - తనతో బుట్టిన-కర్మను విడువరాదు. అంతరాత్మకు అర్పితముగ స్వకర్మ నొనర్చిన సిద్ధి లభించును.

"జ్ఞానమార్గము యొక్క పరమావధి యగు బ్రహ్మప్రాప్తి సిద్ధిగల్గిన వెనుక ఎట్లు లభించునది 50-56 శ్లోకములలో చెప్పబడినది. వీనిని చక్కగా గమనించి శ్రద్ధతో నంతరార్థమును గుర్తించిననే గీత ప్రతిపాదితమయిన మార్గము నెఱుంగ జాలుదుము. అన్నిటియం దసక్తమైన

బుద్ధితో (రాగరహితుడై) జితాత్ముడై కోర్కెలులేనివాడై ఉత్తమ నైష్కర్మ్యసిద్ధిని సన్న్యాసమువలన మనుజుడు పొందుచున్నాడు. ఆత్మైక్యతను గాంచుటచే విషయములాత్మాభివ్యక్తమునకైనవే యను దృష్టితో కేవల విషయములుగా మాత్రము కోరక సదా కర్మల యొనర్చుటచే నైష్కర్మ్యసిద్ధిని పొందును. కర్మలు చేయుచు చేయనివాడే యగును. నైష్కర్మ్యసిద్ధిని పొందినవాడు జ్ఞానము సూచించు యుత్తమపదమగు బ్రహ్మమును –అక్షర పురుషుని–యెట్లు చేరునది సంగ్రహ

ముగ చెప్పుచున్నది. "విశుద్ధమైనబుద్ధిని మన అధ్యాత్మిక సత్తాతో జతపఱచి, అచంచల మగు సుస్థిరేచ్ఛచే సర్వసత్తాను స్వాధీనములో యుంచుకొని, శబ్దాది విషయములను ఇంద్రియ ద్రవ్యములను త్యజించి రాగము ద్వేషములను వదలి, నిర్వ్యక్తయేకాంతమును పూని, స్వల్పాహారియై, వాక్శరీర మనస్సులను స్వాధీనములో నుంచుకొని, ధ్యానమం దంతరాత్మతో సదా నైక్యముగాంచి, కోర్కెలను రాగములను పూర్ణముగ వదలి, అహంకారమును, దౌర్జన్యమును, దర్పమును, కామ

మును, క్రోధమును, పరిగ్రహేచ్ఛను, త్రోసివేసి, నేను నాది యనునవి లేకుండా శాంతి తేజ సమేతుడైనచో బ్రహ్మమయు డగుట కర్హతగల్గును.”

నిర్మలమైన బుద్ధి నిరంతర మంతరాత్మనే బోధించునట్లుచేసికొని, సర్వ సత్తాను స్థిరేచ్ఛచే భగవంతున కైనదే యని నియతముజేసి, ఆత్మ ప్రకటనకే గాక విషయములందు వేఱు భావములేక, దేని యందును రాగము ద్వేషములేక సముడై, తన్మయుడై, మితాహారియై, మనోవాక్కాయములను వాని యిచ్ఛమేరకు

పోనీక ఆత్మాధీనతలో నుంచుకొని, ఎడ తెగని ఆత్మైక్యతనుగాంచి, ఇదంతయు ఆత్మకన్న భిన్నము గాదను వైరాగ్యము తో, నేను, నాది, ఇదికావలె, ఎట్లైనను పగపట్టి సాధించవలెననుట మాని వేసి శాంతి తేజమును కాంచినచో బ్రహ్మము, సర్వవ్యాపియైన అక్షరపురుషుడగును.

రాబోవు రెండుశ్లోకములు గీతయందలి నిర్దిష్టమార్గమును సూచించుచున్నవి. "బ్రహ్మమైనవాడు ఆత్మస్థిమితుడై దుఃఖం చక కాంక్షించక అన్ని భూతములకు సముడై నా యెడల యుత్తమ భక్తిని

గాంచుచున్నాడు. భక్తి వలన నన్ను, ఎవరైనది ఎంతైనది యదార్థమును ఆ మూలాగ్రము తెలిసికొనును. ఆలా నన్ను తెలిసికొని అంత దానియందు (ఆ పురుషోత్తమునియందు) ప్రవేశించును."

"నన్ను సమగ్రముగ భక్తివలన తెలిసికొని పురుషోత్తమ ప్రాప్తిని చెందినవాడు నాయందుండి సర్వకర్మలను చేయుటవలన కూడ నా ప్రసాదమువలన శాశ్వతము అవ్యయమైన పదవిని పొందుచున్నాడు." నైష్కర్మ్యసిద్ధిచే బ్రహ్మభూతుండయి పురుషోత్తమునిమీాది భక్తిగల్గి ఆయనను

తత్త్వతః తెలిసికొని ఆయనయందు జేరి సర్వ కర్మలను సయితము చేయుటచే ఆయనకృపవలన కైవల్యమును పొందును. సన్యాసమార్గము బ్రహ్మప్రాప్తికి గాను నైష్కర్మ్యమును కర్మ సన్యాసముగనే గ్రహించుచున్నది. కాన కర్మనిమగ్నుడైన మానవుడు ఉత్తమబ్రహ్మపదము జెంద గలడాయను సమస్యను ఛేదించుచున్నది. గీతా మార్గము పురుషోత్తముని యందు చేరి సర్వకర్మలను చేయుటచే కైవల్యము గల్గునని నిరూపించినదికాన సమస్యను తేల్చి ప్రకృతిపురుషుల. నాత్మయం

స్త్రైక్యము చేసి సమర్థించినది.

గీతాయోగ ప్రబోధమందలి సారాం శము శిష్యునకిలా చెప్పబడినది. ఆవల57–66శ్లోకములలో నది ఎట్లు అర్జునునిదైన కర్మకేగాక సర్వకర్మలకు ప్రయోగింప దగినది సూచించుచున్నది. ఇవి యోగము యొక్క అత్యంతాంతర్భావమును గల్గి తదుత్కృష్టానుభూతికి దారితీయుచున్నవి గాన మనమాదృష్టితో నన్వయించుకొన వలెను.

"నీ సర్వమునందు నా కర్పితుడవై, సర్వ కర్మలను చేతో యుతముగ నాకు

సమర్పించి, బుద్ధియోగ మవలంబించి, సదా నాచేతనతో నేకమైయుండుము. నా చేతనతో నీవు నిరతైక్యతనుగాంచిన నా యనుగ్రహామువలన నెల్ల కష్టములను దుర్గములను దాటెదవు. అహంకారముచే విననియెడల నాశనము జెందెదవు. అహంకార ప్రేరితుడవై యుద్ధము చేయనని నీవు తలంచిన యది కల్లయేయగు. నీ ప్రకృతి నిన్ను నియమించుచున్నది. మోహితుడవై దేనినిచేయ నిచ్ఛగించవో దానినే నిస్సహాయుడవై నీ స్వభావము వలన పుట్టినవగు నీ కర్మలచే బద్ధుడవై

నీవు చేసెదవు. ఈశ్వరుడు సర్వభూతముల హృదయమందుండి తనమాయ వలన యంత్రముపైన నెక్కించి గిరగిర త్రిప్పు చున్నాడు సర్వభావములతో నాయనను శరణుజెందుము. ఆయనకృపవలన నీవు ఉత్తమశాంతియు శాశ్వతపదవిని జెందెదవు. దాచబడియున్నదాని కన్న రహస్యమగు జ్ఞానమును నీకు తెలియపఱచితిని పూర్తిగా దీనిని పర్యాలోచనచేసి నీ ఇష్టము వచ్చినట్లు చేయుము. అన్నిటికంటె రహస్యమైన ఉత్తమవచనమును నీకు జెప్పెదను వినుము. నాకు చాలా ఇష్టుడవు

కావున నీ మేలుకోరి చెప్పుచున్నాను. నా మనస్సుకలవానివి, నన్ను ప్రేమించి నర్చించువానివి, నాకై యజించువానివి కమ్ము, నాకు నమస్కరించుము నీవు నన్ను చేరెదవు ఇది నీకు నేనుచేయు సత్యప్రతిజ్ఞ నీవు నాకు ప్రియుడవుగనుక సర్వ ధర్మములను పరిత్యజించుము నన్నే శరణుచెందుము సర్వ పాపములనుండి నిన్ను నేను తొలగించెదను చింతపడకుము.''

మన సర్వసత్తా భగవదావిష్కారమునకైనది కాన దాని నంతయు నతనికి నివేదించి చేతస్ఫూర్తిగ కర్మలకతని

కర్పించి బుద్ధితో నతని గ్రహించి ఆతని చేతనతో నైకృతంగాంచిన ఎల్ల కష్టము లను ఆతని యనుగ్రహము వలన దాటె దము. అలా చేయక నేను నేనేయను భావముతో చేయవలసినదానిని చేయను అని తీర్మానించుకొనిన ఆ తీర్మానము వ్యర్థమైనదే యగుచున్నది. ఏలన, మోహి తుడవై నేను చేయను అనుకున్నకర్మ నీ స్వభావమువలన జనించినదిగాన తప్పక చేసెదవు. ఇంతేకాక ఈశ్వరుడు హృద యస్థుడయి బహిర్గతుడుగాక యంతర్వర్తి మై తన మాయవలన యంత్రములపై

నెక్కించి సర్వభూతములను త్రిప్పుచున్నా
డు. ఇది సత్యము కాన సర్వభావములతో
నాతని శరణుజెందిన శాంతము శాశ్వత
మగు పదవి చేరగలవు. ఇది అతిరహస్య
మైన జ్ఞానము. అన్నిటికంటే రహస్యము
నూ కలదు. నీచింతన ప్రేమ నీయజనము
నాయందుంచి నాకై ప్రేరితములుగ నెఱిం
గిన నీవు నన్నుచేరెదవు. నాతో నైక్యము
గాంతువు. ఇది సత్యము. కావున ధర్మ
చింతనముతో ప్రొద్దుపుచ్చక నన్నే—
పురుషోత్తమునే—శరణుజెంది చరించుము.
సర్వము నావలన నడుచుచున్నది కాన

నీకు పాపములంటవు. దుఃఖింపకుము.

"సర్వధర్మములను విడుము, భగవంతునకే అర్పించుకొనుము. నీయందు, నిన్ను చుట్టి, నిన్నతిక్రమించి యున్న దైవమునకే; ఇదే నీకు కావలసినది. ఇదే సత్యము. ఉత్తమమైన మార్గము; అదే వాస్తవమైన మోక్షము."

గీతా ప్రవచన మీరీతి కర్మాచరణం బెట్లు బ్రహ్మప్రాప్తికిని, పురుషోత్తమపద ప్రాప్తికిని, దారి తీయగలదని శ్రీఅరవిందులు గీతా వ్యాసములలో విశదపఱచిరి.

"జీవనసత్యమందలి యతి బహుళము విశేష క్లిష్టాంశమైన కర్మ కధ్యాత్మ సత్య మెట్లు ప్రయోగించునది, ఆత్మయందు మనము జననంబొందుటకు కర్మ ఏరీతి దారి చూపగల్గినది, అధ్యాత్మజీవనతో నెట్లు సమరసము చేయగలిగినది, గీతకు మేముజేయువ్యాఖ్య తేటపఱుచుచున్నది."



# యోగసమన్వయము

“అనుష్ఠింప వీలైనది కానిచో తత్త్వ జ్ఞానము కేవల మవ్యవహారయోగ్య మైనదేయగు. ‘యోగసమన్వయమునందు’ పలువిధములగు అధ్యాత్మ స్వయంశిక్షణ మూలసూత్రముల అనుష్ఠాన క్రమముల సమన్వయదృష్టి నలవరచుకొనుటయును, అవి ఏరీతి మానవజీవితమును పూర్ణజీవనకు గొంపో గలిగినదియును నిరూపించితిమి.”

ఈ విషయమును తేటపఱచుటకు యోగసమన్వయాంతర్గత మగు ఆత్మసంసిద్ధి యోగమందలి పూర్ణయోగ సూత్ర మను అధ్యాయములోని ముఖ్యభాగముల యనువాదము నిచ్చట చేర్చినాము.

"మనుజుని శక్తులం దొకదానిని లేక నన్నిటిని భగవంతుని జేరుటకు సాధనముగ మరల్చుటయే యోగము. సాధారణ యోగమందు జీవుని ప్రధానశక్తి యొకటియే సాధనము మార్గ మగుచున్నది. పూర్ణయోగమం దన్నిశక్తులును చేరి పరివర్తన మొనర్చు సాధనమగుచున్నవి.

"హఠయోగము నందు శరీరప్రాణము లును, రాజయోగమునందు మనస్సును, త్రిమార్గమునందు జ్ఞానము యిచ్ఛ భక్తి యను మనోమయ పురుషుని మూడు ముఖ్యశక్తులను ఉపకరణము లగుచున్నవి.

"ఒక్కొక్క యోగమును దాని విధాన మందు అది యుపయోగించు ఉపకరణము యొక్క గుణమును కల్గియుంటున్నది. హఠయోగ విధానము చైత్య-శరీరకము, రాజయోగ విధానము మానసిక-చైత్య ము, జ్ఞానమార్గము ఆధ్యాత్మిక ము గ్రాహ్యకము, భక్తిమార్గము ఆధ్యాత్మిక

ము భావ ప్రేరితము రసజ్ఞానయుతము, కర్మమార్గము ఆధ్యాత్మికము వీర్యవంతమగు క్రియాపరత. కాని, అన్ని శక్తులును అంతమునందొక్కటే. ఆత్మశక్తియే. మనః ప్రాణ శరీరముల సాధారణ విధానమం దీ సత్యము చివర కక్కడను స్ఫుటమగు చున్నను మన స్వాభావిక ప్రవృత్తుల యందు ప్రకృతియొక్క విడగొట్టి విచ్ఛేదించి పరచిపెట్టు వర్తనముచే మఱుగు పడుచున్నది. భౌతికశక్తియందు ప్రాణశక్తి మనోశక్తి చైత్యశక్తి అధ్యాత్మశక్తి దాచబడి యుండి ఈ శక్తియొక్కరూపముల నన్నింటి

చివరకు విడుదల చేయబడును. యోగ మందే యొకశక్తిని తీసికొని ఉత్తమస్థాయి కి లేవనెత్తి కేంద్రీకృతము చేసినచో నాత్మశక్తిని అభివ్యక్తముజేసి మూలమగు నేకత్వమును ప్రదర్శించును. ఆత్మశక్తి సర్వ శక్తి యగుటవలన సమాహితయోగమున కవకాశ మేర్పడినది.

"తంత్రము స్వభావికముగ సమా హిత శిక్షణయే. యోగవిధానము నది ద్వివిధముగ విస్తరింపజేయుచున్నది. మా నవుని సర్వగుణ కర్మకామములను ఆత్మా ధిపత్యమున సుశిక్షితము గావించి దివ్యా

ధ్యాత్మిక స్థాయికి వాని నుద్ధరించుటయే యీశిక్షణ తుది ఫలితముగ మొదలు లక్షించును. ఆవల తన లక్ష్యమం దన్ని దర్శనములయందు వలె ముక్తి నే గాక భుక్తినికూడ చేర్చుచున్నది.

"మే మనుసరించు సమన్వయము-సమాహితత్త్వము-తాంత్రిక లక్ష్యమును సాధించుటకు వేదాంతమార్గము నుండి ప్రారంభించుచున్నది. తంత్రమందు శక్తి ప్రాధాన్యము, ఆత్మోపలబ్ధికి కీలకము. ఈ సముచ్చయమునందు—సమాహితత్త్వము నందు—ఆత్మ ప్రధానమైనదియై శక్తిని

పొందుటకు మూలమగుచున్నది. మానవుని అన్నమయపురుషునికన్న హెచ్చైన మనోమయ పురుషుని గ్రహించి ఆ స్థాయినుండి మహత్తర మగు నధ్యాత్మికశక్తి కున్ముఖమై ఆ మహత్తర శక్తిచే తన ప్రకృతి సర్వమును సిద్ధిజెందినదిగా జేయజూచును. దానంజేసి హఠయోగ రాజయోగ శిక్షణల నంతగా నుపయోగింపక మనోమయ పురుషశక్తుల నుపయోగించుటకును జ్ఞానము, కర్మ, భక్తి వీనిని ఆధ్యాత్మ బీగమును తెఱచు చెవిగ గైకొనుటకును ప్రాధాన్య మిచ్చుచున్నది.

"దృష్టియందుండగల సూత్రము ఆత్మ సమర్పణము. మానవుడు తనను దైవము యొక్క సత్త, చేతన, శక్తి, ఆనందముల కర్పించుకొని తన మనోమయ యాత్మ యందు కలిసుకొను చోట్లన్నిటి యందు దైవము తానే ప్రత్యక్షముగ, బాహాట ముగ, తెరవెనుక గాక, ఆధారమున కధినేతయై తన సాన్నిధ్యాదేశములచే దివ్యజీవనకు గాను ప్రకృతిశక్తుల నన్నిటిని సిద్ధినొందించుటకై కృతసంసర్గలను కాంచవలెను. యోగాశయములందు మ ఱొక విశాలత బైల్పడుచున్నది.

సామాన్య యోగాశయము ఆత్మనిశ్చలత యందో లేక మఱొక యుత్తమలోక మందో మానవవ్యక్తి లయమగుట యగు చున్నది. తాంత్రికమార్గము ముక్తి నేక లక్ష్యముగా గాకపోయినను తుది లక్ష్య ముగా గైకొని మానవజీవితమం దాధ్యా త్మిక శక్తితేజ ఆనందముల సంసిద్ధ్యాను భవములుగ జేయజూచుచున్నది. సర్వ ద్వంద్వములను విరోధములను జయించి ముక్తి భుక్తి ఇవి రెండు నైక్యత గాంచగల పరానుభవ సూక్ష్మ దర్శనమును కూడ గల్గియున్నది. మేమీ యాధ్యాత్మిక సాధ్య

తల విశాల దృక్పథమునుండి ప్రారంభించి సంపూర్ణార్థదాయక మగు మహాకావశ్య కతను కలుపుచున్నాము. జీవుడు భగవం తునితో కేవలైక్యతకు యత్నించు వ్యక్తి మాత్రమే కాదని మా నమ్మకము. అన్ని జీవులయందు ప్రకృతియంతలో భగవంతు నితో నేకత్వము గాంచగల విశ్వమయా త్మగా గుర్తించి యీ విశ్రుతాశయమునకు దాని యనుభవసాధ్యమైన సంపూర్ణ పర్యవసానమును గైకొనుచున్నాము. యోగమందు వ్యక్తిగతజీవుని మోక్షము, భగవంతునితోడి సాయుజ్యము ప్రధాన

విషయమే యెప్పటికిని. భగవంతునితోడి విశ్వమయైక్యతానుభవము దాని రెండవ లక్ష్యమగుచున్నది. ఇందుండి మూడవది యగు లక్ష్య మొకటి పొడచూపుచున్నది. మానవత్వమునందలి భ గ వం తు ని దైన ఆధ్యాత్మికలీలయందు సహానుభవ సంప ర్కములచే నెల్లజీవులతో దివ్యైక్యతా ర్థ మును గాంచుటే ఇది. వ్య_క్తిగతయోగ మంత ప్రత్యేకతనువదలి జాతియందు పర ప్రకృతి యొనర్చు సమష్టి యోగాంశ మగుచున్నది. ముక్తి నొందిన పురుషుడు ఆత్మ అధ్యాత్మలయందు నేకమై జాతి

యందు భగవంతుడు పూర్ణ వికాసము నొందుటకు తనలో తా నాత్మ సంసిద్ధోప కరణంబగు.

"ఈ వికాసము రెండు భాగములు గలది. మొదలు ప్రత్యేకియైనజీవుడు ఆత్మ యందైక్యతం గాంచుట. ఆవల పరప్రకృతిని దాని సోత్కృష్ట స్థాయియందధీనతం గాంచుట. కాన ఈ జ్ఞాన భక్తి కర్మల పూర్ణయోగము ఆధ్యాత్మిక-విజ్ఞాన-ఆత్మ సంసిద్ధియోగముగా విస్తరించవలెను. విజ్ఞానమయ జ్ఞానేచ్ఛానందములు ఆత్మ యొక్క ప్రత్యక్షోప కరణంబు లగుటచే

ఆత్మయం దభివృద్ధిగాంచుట వలన లభింప బడగలవి యగుటచే ఈ యభివృద్ధి మా యోగమునకు ప్రథమలక్ష్య మగుచున్నది.

"భగవంతుడు జీవునియందు విజ్ఞాన మయ వికాసమును సిద్ధి యొనర్చుటకు పూర్వము మనోమయుడు భగవంతుని తోడి ఐక్యతను విస్తృతిని గాంచవలెను. దానంజేసి త్రిమార్గ మీ యోగమునకు కీలక మగుచున్నది. అదే యీ యోగము పూర్ణమైనది కావలసినదానికిని కారణము.

"అనంతమునందు లీనమగుటయే మన లక్ష్యమైన పూర్ణయోగము యనవసరమే

యగు. ఏ యొక యాత్మశక్తితో నైనను మనము భగవంతుని చేరగలము. కాని విజ్ఞానమయత్వము భగవంతుని సర్వస్వము యొక్కయు పరప్రకృతి సర్వస్వము యొక్కయు సమగ్రాధీనానుభవ మగుచున్నది. మానవుని సర్వస్వమును దివ్యాధ్యాత్మిక జీవనశక్తియందు పూర్ణముగ నుద్ధరింపబడుటయే యగుచున్నది. ఈ యోగమునకు పూర్ణత అత్యావశ్యకవిధి యు నగుచున్నది.

త్రిమార్గమందే యొక్కటియు నుత్కృష్టస్థాయి యందు విస్తృతవ్యాపారముచే

నితరశక్తులను గ్రహించి వానిని పూర్ణతకు గొనిపోగల్గుటచే యేదో నొకదానితో ప్రారంభించి యితరములను కలిసికొను స్థానమును గుర్తించి తన విస్తృతియందు వానితో లీనంబయిన చాలును. కడు కష్టము సంశ్లిష్టమైనను వీర్యవంత మగు విధానము ముమ్మార్గముల చేర్చి ప్రారంభించుటయే. కాని ఆత్మసంసిద్ధి యోగ ప్రక్రియ నియమ సాధనముల చక్కగా గుర్తించువఱకా సాధ్యతా పరిశీలన మాపవలెను. ఏలన, దీనిని బొత్తుగా నాప రాదని తెలియగలము. కాని దివ్య కర్మ

భక్తి జ్ఞానములం దభివృద్ధి గాంచుకొలది దానికొఱకగు కొంతసన్నాహమును దానియందొకవిధమగు ప్రవేశమును అగుచున్నది.''

దీనినుండి శ్రీవారి సిద్ధాంతము లేవిధముగ వ్యక్తిగత జీవుండాచరించుటకు తోడ్పడ గల్గినది వివిధయోగశిక్షణ సూత్రముల నెట్లు సమన్వయము చేసుకొని పూర్ణ సంసిద్ధి బడయుట కుపయోగించ వలసినది తేటపఱుపబడినది.



# మానవసంఘవికాసతత్త్వము

"కాని ఇది వ్యక్తిగత అభ్యుదయము మాత్రమగు. దానంజేసి మానవసంఘ జీవితమం దేరీతి మాసిద్ధాంత ముపకరించునది చూపింప నవసర మేర్పడినది కూడ. 'సంఘాభ్యుదయతత్త్వ'మందు ఈ సత్యము లెట్లు మానవసంఘ పరిణామము ను మార్చునది సూచించితిమి."

దీనియందలి కడపటి రెండు అధ్యాయములలో శ్రీవా రధ్యాత్మికయుగ స్థాపన నుగూర్చి యిలా వ్రాసినారు.

"మేము వచించుచున్న ఆధ్యాత్మిక
పరివర్తనము జరుగవలెనన్న నేకకాలము
నందే నిర్వహింపబడవలసిన రెండు విధులు
గలవు. తామాత్మబింబములుగ పునర్జ
న్మంబు గాంచి, వికసించి, తమ భావమును
శక్తిని జనసామాన్యమున కెఱుకపఱచ
సమర్థులైన వ్యక్తి, వ్యక్తులున్ను, నిశ్చ
యమైన పరివర్తనము జరుగకముందే
యాగిపోవు లేక చ్యుతమగునట్టి సన్నా
హము నందలి లోపమువంటి నైజ లోప
ములచే గాక చక్కగా గ్రహించి భావై
క్యతం గాంచి, ఆచరణలో నుంచుకొని

రూఢిగా వ్యక్తముచేయగల జనసామా న్యము, సంఘము, సాంఘికమనస్సున్నూ యీరెండువిధులు. ఇదివఱ కెన్నడీరెండును నేక కాలమందు సంఘటిల్లలేదు. కాని యది తప్పక జరుగగలదు.....

"ఈ పరివర్తనమున కనుకూల మగు సంఘము లేక జనసామాన్యము యొక్క మనఃప్రవృత్తి దానిని నిక్కచ్చిగా నిలువ బెట్టలేకపోయినను దానికై నిశ్చయమైన సన్నాహమునైనా జేయగలుగుట కేస్థితి గల్గియుండవలెను? ఎప్పటికిని సంఘము సిద్ధముగా లేకపోయి అనర్హముగ నుండుటే

ముఖ్య విపత్తు. జనసామాన్యముయొక్క మనఃప్రవృత్తి స్థితియే ప్రధానమైనది. సామాన్యజన మనస్సు చివర నుండవలసిన ఉత్తమాశయములకు జేరిన భావముల కెడమియ్య ప్రారంభించినచో, ఈ భావములచే జనించిన యభీప్స మానవుని హృదయమును ప్రేరేపింప మొదలిడినచో, యనతికాలమం దొక్కింత యభివృద్ధి నాసింపవచ్చును. మానవసంఘమందు మనస్సంబంధమైన అంతఃకరణ ప్రాధాన్య యుగాగమన సూచనలను జీవననుగూర్చిన అంతఃకరణాశయాభివృద్ధియు అతిముఖ్య

సూచన యగు.

"అంతఃకరణ ప్రాధాన్య యుగము ఆధ్యాత్మికమునకు చాల దూరమందే నిలిచిపోగలదు. వరుణుని కుమారుడైన భృగువువలె మొదలు అన్నమయపురుషుని ఆవల ప్రాణమయుని, మూడవతూరి మనోమయుని, బాహ్యాత్మీయదృష్టినివదలి నిత్య సత్యమునకు జేరుటకు పూర్వము కనుగొనినట్లుపనిషత్తులో చెప్పబడినరీతిని ఆత్మను, సత్యమును, గూర్చిన యన్వేషణ సాధారణముగ యనుసరింపవచ్చును. అది ఎక్కడైనను నిలిచిపోగలదు.పందొమ్మిదవ

శతాబ్దమున భౌతికసూత్రమే మానవుని పాలించినది. దానిని తొలగించుటకు జేసిన ప్రథమ యత్నము ప్రాణమయమందుదించి ఈ రెండు సూత్రములు కలసి ప్రపంచ యుద్ధమునకు దారితీసినవి. జీవించుట, విస్తరించుట, వృద్ధిజెందుట, ప్రాణశక్తిని పెంపు జేయుట, జీవనయంతఃప్రేరణను తెలిసియుప యోగించి పూర్ణము జేయుట పాపకర్మములు కావు. ప్రాణమును మించినదానిచే తన కావలయుండు స్థాయిక ద్దానిని నడిపింప గలిగితిమేని యవి వాంఛనీయములే. అట్లు గానిచో నవి రాక్షసక్రియలే కాగలవు.

"ఈ ప్రాణమయ యంతఃకరణ ప్రాధాన్యత కావల మనోమయ చైత్యయాత్మీయత గలదు. అది మానవజీవితోద్ధారణను అన్నమయ ప్రాణమయశక్తుల యభివృద్ధి వలననేగాక మనోమయ చైత్యపురుషాన్నత్యము వలననే జేయగలదు. ప్రాణమునందు జ్ఞానమువలని శక్తిఆనందములను, సౌందర్య మందలి శక్తిఆంనదములను, మానవ సంకల్పమందలి శక్తిఆనందములను గాంచుటకు, భౌతికప్రకృతినేగాక ప్రాణమనఃప్రకృతులను జయించి అందలి రహస్యశక్తులను కనుగొని, ప్రాణిక పరిమితులనుండి విము

క్తము గాంచుచూ, క్రొత్తచైత్య సంబంధముల కొఱకు, క్రియయందు పూర్ణముగ భావము నుపలబ్ధిగాంచ కడు సమర్థమగు శక్తిని పొందుటకు, భౌతిక శాస్త్రమున కందరాని దూరదృష్ట్యాది విషయముల సాధించుటకు అవకాశముగ చూడగలదు. సామాన్యజనుల కిదంతయు నసాధ్యంబయినను అనేకు లీ భావములను గల్గియున్నారు.

"ఈలాంటి మనుష్య చింతనము జీవనాశయము యుద్యమము మానవులయందనోన్య సన్నిహిత సంసర్గను కల్పించి

జీవన హృద్వృత్తి)మలను పెంచకలదు. ఇంక
ను ఉత్తమ విషయములకు కొనిపోగలదు.
కాని దీనియందును అపాయములు కలవు.
అయితే వానినుండి తప్పించుకొనగల
తేజోశక్తి రక్షణక్రియకూడ యిందున్నది.

"మూడవదియగు మానసిక యాత్మీ
యత యందే ఆత్మ ప్రాధాన్యమైనదనియు
మనస్సు రెండవదియను భావము వృద్ధి
జెందును. ఆత్మ నిత్యము ఆద్యము అన్నిటి
యందు దాగి అభివ్యక్తమగుటయే యే
కైక సత్యమని గుర్తించుకొలది నిశ్చయ
యత్నము ప్రారంభమయి జగత్తును

ఆత్మాభివ్యక్తి కేంద్రముగ నెఱుంగుచు ఆధ్యాత్మికయుగ ప్రారంభమునకు సావ కాశ మేర్పడును. జనసామాన్య మింత వఱకు అర్థము లేని మాటలుగ నమ్ము దైవము, స్వేచ్ఛ, ఐక్యతలను మూడు సత్యములను అంత నాధ్యాత్మిక మానవసంఘము ఉపలబ్ధిగాంచును. మనుజుడు దేవునిగాంచి స్వాధీనములో నుంచుకోగల్గినంతనే స్వేచ్ఛను, ఐక్యతను తెలిసికొనగలడు. మఱొక విధమున ఎప్పుడును తెలిసికొనలేడు.

మానవుడు తన అహంకార బింబములనే నిర్మించుకొని వాని నెల్లప్పుడు చూ

చుచూ వానినే సర్వత్ర భగవంతుని ప్రతిమలని నిరీక్షించుచుండగా భగవంతుడు తెలిసికొనబడుటకై వేచియున్నాడు. ఈ అహంకారమును తొలగించి వేసి యీ యహంకృతి వేటను విరమించగనే ఆధ్యాత్మికానుభూతి కవకాశము కల్గును.

"ఆధ్యాత్మికమైన సంఘము ఆధ్యాత్మిక వ్యక్తుల వలెనే అహంకారమునందు కాక ఆత్మయందే సమష్ట్యాత్మయందే వసించును. ఈ యహంకార రాహిత్యమిప్పుడు దాని నొనర్పజూచు ప్రయత్నమునందువలె సముదాయ కేచ్ఛలక్ష్య

మందు సంఘయహంకృతియందు వ్యక్తితన యిచ్ఛాభీప్స వ్యక్తిత్వములను బలియిచ్చు కొనుట కాజాలదు. ఆధ్యాత్మిక మనుజుడహంకారమును వదలి కోరునది అన్నిటి యందొక్కటై అన్నిటిలో సిద్ధము పూర్ణము నైన యాత్మనే. దానియందు జననం బందుటచే దాని సంసిద్ధియొక్క బింబముగ విశ్వవ్యాప్తిని గాంచెడు స్వీయప్రకృతితో వృద్ధిజెందుటయే.

“కావున సంఘము ఆధ్యాత్మికముగా మారినది మొదలు తన విధానమునందెల్ల విజ్ఞతలను పరిరంభ మొనర్చి, జగద్వ్యాపార

ఫలోత్పాదకమే లక్ష్యముగా గైకొనక ఆత్మానుసంధాన వికాసములకే యత్నించును. భౌతికచైత్యశాస్త్రములు ప్రకృతి విధానమును జగత్తును తెలిసికొని మానవుని భౌతికార్థములకే యుపయోగించుకొనక జగత్తునందు జగత్తువెనుక నుండు భగవంతుని, వేషములయందలి యాతని పోకడలను తెలిసికొనుటకే నుపాసించును. నైతిక లక్ష్యమును సంఘ ధర్మమును సరిదిద్దు విధిగా మాత్రము గైకొనక జాతియందు దివ్యప్రకృతిని వృద్ధిజేయసమకట్టు. కళాలక్ష్యమును జగద్దృశ్య బింబప్రదర్శ

నము మాత్రమేగాక నవియేసత్య సౌం దర్యము యొక్క రూపములో దానిని ప్రత్యక్షముజేయు దృష్టిగా గ్రహింప వలెను.

"సాంఘికదృష్టియందు సత్పురుషుడు మొదలు నేరస్థుడవఱకు గల వ్యక్తులను సాంఘికమూసయందు చదునుపఱచ వల సిన వారినిగా లేక చితుకగొట్టవలసిన వారినిగానెన్నక వలలో చిక్కుకొని బాధ పడుచుండి రక్షింపబడవలసిన జీవులుగను, వృద్ధిజెందుచున్న వృద్ధినొంద పురికొల్ప దగిన జీవులుగను, సహాయమును శక్తిని

వారియందుండి యాకర్షింప వీలుగ వృద్ధి పొందిన జీవులుగను యెన్నగలదు. దాని యార్థిక లక్ష్యము పోటాపోటి విధానము నకు గాని లేక సహకారవిధానమున జేరిన మహత్తర యుత్పత్తి యంత్ర నిర్మాణ మగు టయేకాక జనులకు కొందఱికిగాక యంద ఱకు వారివారి స్వభావమునకు తగినట్లు పనిపాటలయందలి యానందమును, అంత రంగికాభి వృద్ధిజెందుటకు కావలసిన స్వే చ్ఛతోకూడిన విశ్రాంతియు వీనితోకూడ సామాన్యైశ్వర్యమును సుభకరమగు జీవ నయు సమకూర్చవలెను. రాజ్యాంగము

నందు జాతుల నతిబాహుళ్యమైన రాష్ట్రి యంత్రములుగను నరులు దానికై జీవించు చూ దానినే తమ దైవముగను భూమం బైన యాత్మగను పూజించి దాని బలిపీఠ మున యాహ్వానించగనే నితరుల బలిగొని తన రక్తము చిమ్మించి ఆ యంత్రము చెక్కుచెదరకుండా నుండునటులను, శక్తి వంతము, పూర్వముకన్న విశాలము, క్లిష్టమైనదిగా నొనర్ప చూచువారిగను యెన్నదు—అన్యోన్యసంబంధముల యందు వారిని యొండొరుల పీడించువారిగను చూడదు. వారిని వర్గజీవులుగను, మానవ

సముదాయమందలి దైవముగను, వ్యక్తుల వలె వారి నైజ ప్రకృతియందు వికసించి, దానంజేసి యొండొరులకు వ్యక్తి సమష్టుల యందు దివ్యాత్మను తెలిసికొనుటకు తోడ్పడగల జీవులుగను ఎన్నగలదు.

ఆ ధ్యాత్మిక యుగ మం దు స్వతంత్ర ధర్మ ముత్కృష్టమైనదిగా చూడ బడును. ఆత్మజ్ఞానము లేనిచో మానవుడు బాహ్య నిర్బంధములను తప్పించుకొనలేడు......

"అతడప్పుడు కులము తెగ వర్ణము గోత్రము సంఘము జాతి వీనికి బానిస యగును. అంతే అతను కాగలడు. అవి

యతనిని బలవంతపెట్టక మానవు. ఏలన, తానును అవియు అహంకార బద్ధులు. ఇతర నిర్బంధములను తొలగించుకొనవలె నన్న ఆత్మ నిర్బంధము మనము గుర్తించి దానికి లొంగియుండవలెను. ఆత్మాధీనతను పొందియుండుటయే స్వాతంత్ర్యముయొక్క లక్షణము. స్వాభావికాభివృద్ధి వలననే కాని ఆత్మనాశనమువల్ల భగవంతుని కనుగొనలేము. కాని, అట్లయ్యును భగవంతుడు మన పురుషాంగములను వానివాని ప్రకృతుల యందు వృద్ధిగాంచుట కెడమొసంగునని చెప్పవలెను. కావున యదార్థము

జీవ వంతమగు వికాసము భూమంబగు స్వేచ్ఛయందే యుద్భవింపగలదు.

"అధ్యాత్మిక యుగమందలి మానవజాతీసత్యమును గుర్తించుచున్నది. మానవుని సిద్ధపురుషునిగా చేయుటకు యంత్రముల నుపయోగింప పూనదు. అవయవముల బంధించుటచే చక్కగా నిలువబెట్ట యత్నింపదు. సంఘమందలి వ్యక్తికి పోలీసులను యుద్యోగులను యాతని యున్నతాత్మగా చూపింపదు....అహంకారమునుండి ముక్తి గాంచిన తన దివ్యప్రకృతి ధర్మమువలననే యాతని జీవనము నడుచునట్లు చేయును.

"ఇట్లనుటచే మానవ సంఘము వ్యక్తుల ప్రత్యేక వర్తనముగా విచ్ఛిత్తి గానేరదు ; ఏలన, ఆత్మయొక్క మూడవ వాక్కు ఐక్యత. సిద్ధజీవనకు సిద్ధయిక్యత సూచనయు, ఇతరులతో నైక్యతయం దభివృద్ధి నొందుటయు, పురుషావసరమును అగుచున్నవి. సర్వమునందును భగవంతుని జూచు నాతడు అన్నిటిలోనుండు భగవంతుని ప్రేమతో సేవించును. తన స్వతంత్రమునే కాక యందరి స్వతంత్రమునకై తన సిద్ధికే కాక యందరి సిద్ధికిని పాటుపడును. తనకు సంఘమునకు రాష్ట్రమునకు, వ్యక్తి

గత అహంకారమునకు సాముదాయక అహంకారమునకు గాక అన్నిటికన్న మహత్తరమైనదానికి తనయందలి దైవమునకు జాతియందలి దైవమునకై జీవించును.

"ఈ సత్యములను సామాన్యజన మనస్సు గుర్తించ నారంభించి, త్రివిధ-త్రైక-ఆత్మచే చలింపబడిన లేక చలింపబడ నిచ్ఛగించినప్పుడే ఆధ్యాత్మ యుగాగమనము సంసిద్ధంబగు. సాంకేతిక యుగమందు సాంకేతికముల ద్వారా జూడగోరినవియు, జీవనము మరుగున యుండునట్టి సత్యము

నందు సాంకేతికములవల్లగాక, రూఢియైన లేక వ్యక్తియొక్క హేతుప్రమాణేచ్ఛల వల్లగాక సత్యముయొక్క పరిపూర్ణస్వభావముగ మన యుత్తమోత్తమ ప్రకృతి యందు జీవింప మొదలిడగల యుగమును చేరగలడు.

"ఆధ్యాత్మికసంఘము ప్రతిష్ఠింపబడవలెనన్న సర్వసాధారణమగు ఆధ్యాత్మిక ప్రభోదమును అభీప్సయు మానవజాతి యందు లక్ష్యముగా నేర్పడవలెను. కాని దీనిని రూఢిగా నెరవేర్చుశక్తి మానవ జీవుని ఆధ్యాత్మిక అచ్చుయందు పున

ర్నిర్మాణము జేయునదే యగుచున్నది.

"లక్ష్యము కేవలాభీప్సగానే యుండక జీవన సర్వస్వమును తన యచ్చుచందే ముద్రితముగా చేయవలెను. మన బాహ్యాంతరములయందు సత్యమును నిర్మించుకొనవలెను. దివ్యసంసిద్ధి ఎప్పటికిని స్వర్గమందు కలదు. మనుజుడు భగవంతుడై భగవంతునియందు జీవింపగల్గుటయే ఆధ్యాత్మిక మగుటయందలి యర్థము.

"ఈ క్రొత్త యుగమునందు భవిష్యజ్జాతికి మిక్కిలి తోడ్పడగల వ్యక్తులు ఆధ్యాత్మిక పరిణామము మానవుని విధి

అవసరమని గుర్తించినవారగుచున్నారు. మతస్వరూపమునందంత లక్ష్యభావము పెట్టక జనులు వారి స్వభావ నియతమైన మతస్వరూపముల నుపాసించుటకు వదలి పెట్టెదరు. ఆధ్యాత్మిక పరివర్తనమందలి, దాని ననుచరణలో నుంచజూచు యత్నమందలి విశ్వాసమును ముఖ్యమైనదిగా గ్రహింతురు. యంత్రములవలనను బాహ్య సంస్థల వల్లను నియ్యది సమకూర్పబడగల దని పొరబడరు. ప్రతివ్యక్తియు ఆంతరంగికముగా దాని నాచరణయందుంచని యెడల నది యెన్నటికి నిజముగ ప్రతిష్ఠంప బడ

దని వా రెఱుంగుదురు. ముక్తిని తన యాత్మయం దన్వేషించవలె నని యాజ్ఞా పించు ప్రాక్ప్రబోధమందలి నిజాంతరార్థము ను, జీవనకు ప్రతీచి సక్రమముగ నొసంగు ప్రాముఖ్యతను మనము తెలిసినంతలో సదుపయోగ మొనర్చవలెననుటయు, జీవ న ధర్మముగ మఱొక దృష్టితో నామో దించెదరు. సంఘమును తేజస్వినులగు కొంద రాధ్యాత్మిక పురుషులకు ఛాయా క్షేత్రముగ యొనర్చరు. అపజయంబుల వలన శ్రద్ధను కోల్పోయిన జాతిని యుద్ధరింప పూనిన మహాపురుష దృక్పథము నుండి

ప్రారంభించి, బహుజనము హీనస్థితియందే యుండగలరు, కొందఱు మాత్రము తేజములకు ప్రాకగలరను భావము నామోదింపరు.

"చేయవలసినది మానవజీవిత మంత విశాలమైనది. కాన మార్గదర్శకులగు వ్యక్తులు మానవజీవితము నంతయు తమ దృష్టియందుంచుకొనెదరు. వారికి భిన్నమైనది వారి విధానమునకు జేరనిదేదియు లేదని గుర్తింతురు. ఒక్కొక్కదానియందును దాని పరివర్తనమునకు తగు సాధనము నన్వేషించెదరు. ఏలన, అన్నిటియందును దైవము దాచబడియున్నదని

తెలిసికొనుటచే ఆత్మాన్వేషణకు తన సాధనములుగ నన్నియు కాగలవనియు దివ్య జీవనోపకరణములుగ నన్నియు మార్పబడగల వనియు పరిగ్రహింతురు. సాధారణమనస్సు నధ్యాత్మికముగ మార్చ వలసినట్టియు, ఆపయి దాని నంతకంత పూర్ణమగు ఉన్నతోత్తమస్థాయి కున్మీల నము చేయవలసినట్టియు ఆవశ్యకతను చూచుచున్నారు.

"ఈ యుద్యమము వ్యక్తికి కూడ ఉత్తమము కష్టము అయిన కృషియే, కాన జాతికింకను కష్టమైనది. రూఢియైన

ప్రథమమార్పును పొందినను, మానవజాతి అంతయు నా స్థాయికి జేరజాలదు. కొంత కాలము ఆధ్యాత్మిక భూమిక యందుండ గలవారుగను అచ్చటినుండి మనోభూమిక కవరోహించు తేజమందు మాత్ర ముండ గలవారుగను రెండు భాగములుగ విభ జింప బడగలరు. అదియును పరివర్తనమే వైప్రారంభదశ కాగలదు. ఆధ్యాత్మిక స్థాయియందలి ప్రథమభూమికకు చేరినప్పు డు సయితము వేదఋషులు వచించినట్లు ఆ స్థాయియందు యింకను యున్నతము లగు భూమికలు కలవు.

# మానవ ఐక్యతాశయము

"మానవైక్యతాశయమందు మానవ జాతి యిప్పుడేలాగు సన్నిహితైక్యత కున్ముఖమై యున్నది, ఎట్లు నడచుచున్నది పరిశీలించి వాస్తవమైన మానవైక్యత సాధించుట కేమి లోపించియున్నది చూపించితిమి."

మానవజాత్యైక్యతోద్యమ మిప్పుడేలా నడచుచున్నది సక్రమమైన ఐక్యత సిద్ధించుట కందేమి లోపించియున్నది తెలిసికొనగల్గుటకు ఈ గ్రంథమునందలి

"సారాంశము-పర్యవసానము." అను కడపటి అధ్యాయానువాదమును సంక్షేపముగ వ్రాయుచున్నాము.

"రాజకీయపాలన విధానములచే నందతుకైన అరకొఅయగు యంత్రోప ఐక్యతను నిర్మింప సాధ్యపడినను మానవజాతి ఐక్యత సాధింపబడినను, యిప్పటికినీ కార్యకారి యగు జాతియొక్క యుత్తమాశయమైన జాతియొక్కమతమువలననే అయ్యది ఆధ్యాత్మికంబయి జీవన సాధారణాంతిక ధర్మంబయ్యేనేని స్థిరపఱుపబడి వాస్తవమైనదిగ చేయబడగలదు.

"బాహ్య ఐక్యత సాధించుకొనవచ్చు. వలన అది తప్పనిసరియైనది. మానవసంఘమందలి ప్రకృతి వర్తనముయొక్క తుది పోకడ అతిసన్నిహిత జాతీయవిధానమందు జాతినంతయు మొత్తముపయి నొక్కటిగా జేయ తప్పిపోనేరదు.

"ప్రకృతియొక్క ఈ క్రియావిధానము రెంటిపై నాధారపడి యున్నది. ఒకటి, సాధారణమైన అక్కర లందఱికి దాదాపు యొకే సముదాయమునకు జేరియుండుటచే జాతియందలి విభాగములు, అడ్డులును, బలహీనతయునై, నిరోధములకు, సంఘర్ష

ణాలకు, ఈ కలతలనుండి కలుగు పోరు
వలన అందరికి కలిగెడు వినాశకరమగు
విపత్తుకు, విజయములు కూడ తాము
సాధించినదానికి మితిలేని వ్యయము చేయ
వలసి వచ్చుటకును దారితీయుచున్నవి.
రాగలవని తలచిన యీ లాభములు,
యుద్ధము, కడు క్లిష్టము వినాశకరము అగు
కొలది సాధింప కడు కష్టమునై జయము
సందిగ్ధమైనదగుచున్నది. అక్కరల
సాముదాయకత్వమును అన్యోన్య సంబంధ
మును అధికముగ గుర్తించి వినాశనకర
మగు యుద్ధమువలని ఫలితముల నెడు

రొక్కాన ఇష్టపడని యెడల నీ విపత్తులకు దారితీయు విభాగములను తగ్గించగల సాధనముల నెంతయు నాసక్తితో గ్రహింతురు. విభాగములను తగ్గించు సూచన యొకమారు నిశ్చయరూపమును దాల్చినచో సన్నిహితమగు నైక్యతకు త్రోవదీయు ప్రోత్సాహము ప్రారంభమగుచున్నది. ఈ సాధనము వలన ఐక్యత సిద్ధింపనిచో ప్రకృతి యితర మార్గములను, యుద్ధమును, బలవంతుల విజయమును లేక జడిపింపబడినవారి తాత్కాలిక యధీనతయును, సన్నిహితైక్యతా విధానమును సమకూర్ప

నుపయోగించును. ఈ సాధనములనే ఈ బాహ్యావశ్యకతనే జాతి వర్గములను జాతీయ సాంమ్రాజ్యములను నిర్మించుట యందుపయోగించినది. అంతర్జాతీయ ఐక్యతవైపు జాతిని నడిపింప నీ సాధనము నే ఈశక్తినే కాలానుగుణ్యముగ క్రియా పరత్వమున మార్చి యుపయోగించు చున్నది.

కాని, రెండవదిగ, సఖ్యత యొనర్ప గూడినట్టియు అందరికి సామాన్యమైనట్టి యు భావసంకల్పము. ఇది రెండువిధముల పనిచేయవచ్చును. ఇది ముందుగా నైక్యత

నుత్ప త్తిజేయు లేక సహకారియగు కార ణము గావచ్చు. లేక తర్వాత కలియకను బలపఱచు ఫలితమును గావచ్చు. మొదటి పద్ధతిలో పూర్వము విభాగములుగా నున్న వర్గములలో విశాలైక్యతను గూర్పనే భావసంకల్ప ముద్భవించి, ఆ భావసంకల్ప శక్తిచే తీసికొనిరాబడగల ఐక్యతారూపము నన్వేషణము చేయ ముఖ్యముగ ప్రేరే పించును. రెండవపక్షమున యితరము లగు బాహ్యకారణములకు తోడ్పడ వచ్చును. వెనుకటి దినములలో నీ భావ సంకల్పమంత ఫలదాయకముగా నుండ

లేదు. రానురానది స్పష్టతరమైన రాజ్యాం
గ భావములచే బలపఱుపబడి గుణవంతమై
విశాలతరమగు జాతీయ సముదాయము
లు—రాసులు—వృద్ధి జెందినవి. అమె
రికా యందలి సంయుక్త రాష్ట్రములు,
ఇటలి, జర్మానియా దేశములలో నగునవి
ఈలా ఒక్కటైనవి. కాని, యితర దృష్టాంత
ములైన ప్రాచీన జాతీయ ఐక్యకూటము
లందు మొత్తముపైన ఈ భావసంకల్పము
బాహ్య లేక యంత్రోప ఐక్యతా ఫలిత
ముగ పెరిగినది. ఈ భావసంకల్పము రూప
మెత్తుటకుగాని వృద్ధిజెందుటకుగాని చైత్య-

మానసిక మూల మనివార్యము. అది లేనిదే అచ్యుతము కలకాలము యుండగల ఐక్యత కలుగనేరదు.

"ఇప్పుడు ప్రకటింప మొదలిడెడు అంతర్జాతీయ జగదైక్యతనుగూర్చిన నడక బాహ్యపరిస్థితుల వలనను పరిసరావసరముల యొత్తిడివలనను బయల్పడుచున్నది. ఈ వ్యావహారికమైన ఐక్యతాభివృద్ధిని త్వరజేయు విశ్వాత్మక అంతర్జాతీయ భావసంకల్పము, ఈ బాహ్యపరిస్థితులచే ప్రోత్సాహము చేయబడిన భావసంకల్పమున్నూ కలదు. అది అంత గుణవంత

మైనది కాకపోవచ్చు. అనుకూలముగాని పరిస్థితుల తాకిడిని యెదుర్కొనలేక పోవచ్చు. క్రొత్త విచ్ఛిత్తిశక్తుల మధ్యా గ్రామి శక్తుల పుట్టుకయును, వెనుకటివి మరల స్థిరబడుటయును, తుదకు త్రోసివేయ లేకపోవచ్చు. కాని యది బలవత్తరమగు శక్తిచే, ఒకవిధమగు జాతియొక్క బౌద్ధిక మగు మతముచే, కొందఱి మనస్సులో స్పష్టముగను, బహుజనముచే అస్పష్టము గను గ్రహింపబడి, ఈకాలపు ప్రవర్ధమాన మగు సంస్థల పోకడను మనోగమనమును నెలకొల్పుటయందు తోడ్పడిన శక్తిచే

సహాయము నొందుచున్నది. ఇదే చైత్య-మానసికశక్తి. ఇది జాతిసూత్రము నతిక్రమించి దేశముయొక్క మతమును సయితము మార్చివేసి, జాతీయభావ సంకల్పమును తన తీవ్రతర రూపములయందు పూర్తిగా హతము చేయుటకును మనుష్యులం దేకజాతిని నిర్మించుటకై దానియందలి భాగముల తుడిచివేయుటకును నాకాంక్షించుచున్నది.

"కష్టము లెంత గొప్పవైనను ఈ మార్గమే చివరకు అనుభవములోనికి రాగలదని మనము చెప్పవచ్చును. ప్రస్తుత

మంత తృప్తికరముగాలేని అంతర్జాతీయ సంబంధముల పరిస్థితి యిప్పటి యుద్ధము వలె ప్రపంచము నంతయు నాక్రమించు కొనునంత గొప్పవిగనో లేక తమ యుద్దేశమం దొక్కొకటియు పరిమిత మైనవైనను మొత్తముపయిన ప్రపంచమంతయు వ్యాపింప గలవిగాయై వానితో ప్రత్యక్ష సంబంధము లేనివారిని కూడ తపింపజేయు ప్రళయపరంపరలకు దారితీయ గలిగినచో ఆత్మరక్షణార్థై మానవజాతి సన్నిహితము బలవత్తరమగు నైక్యతకు నీడ్వబడగలదు. దానికిని తిన్నగాజరుగు ఆత్మహత్యకును

మధ్య నద్దాని యవకాశ ముండగలదు.
బయటపడు మార్గమును మానవుని బుద్ధి
కనుగొనలేని యెడల తన కార్యసాధనకు
ప్రకృతియే ఈ ప్రళయముల నాలా తప్పక
రూప మొసంగు. కాన త్వరలోనో లేక
దూరమందో. అందఱకు చేరిన యవసరము
ల వలనగాని పరిస్థితుల విప్లవకర తాకిడుల
వలనగాని ప్రేరేపింపబడి స్వీయ ఐక్యతకు
జేరిన ప్రవర్ధమానంబగు భావసంకల్పముచే
కల్పింపబడినను, యేదోయొక వ్యవహారిక
మగు నైక్యత భూమియందలి మానవ
జీవితమందు తప్పనిసరిగా, చెప్పనలవిగాని

దాని కెల్లవుడు తావిచ్చినను, తుదకు యనుభవము కాగలదని మన మనుకొన వచ్చును.

"పూర్వ జాతీయపరిణామ సాదృశ్యము ననుసరించి యీ అంతర్జాతీయ ఐక్యత కేంద్రీకృతమైన ప్రపంచ రాజ్యముగనో లేక మానవజాతియొక్క సులభ కట్టడి సముదాయమో సన్నిహిత సమాఖ్యమో కాగల కుదటబడని ప్రపంచ సమాజము గనో రెండు రూపములలో నొకటిగా తయారు కాగలదు. జీవనస్వేచ్ఛా విహార మునకును జాతియొక్క స్వాస్థ్య పురో

గమనమునకును అవసరమైన విశాల బహుత్వ సూత్రమున కెడమియ్యగలదు కాన కడపటిరూపమే చాలా కోరతగినదిగ మాకు కన్పించుచున్నది. ప్రపంచ రాజ్యము జనుల జీవన నెల్లను తన చేతియం దుంచుకొని శాసింపచూచు చివరకు. జాతీయ వ్యక్తిత్వమును కూడ రద్దుజేసి తుదముట్టించగలదు. ఆ పర్యవసాన మిప్పు డనుభవములోనికి రాజాలని భావము మాత్రముగ కన్పించవచ్చు కాని, యది తుదిసాధ్యత నంతగా నతిక్రమించని పరిస్థితు లేర్పడినపుడు తప్పక సాధ్యమైనది

కావచ్చు. సంయుక్త విధానము అంతకంటే సులభకట్టడి సముదాయము జాతీయతను జాతీయ జీవనను భద్రపఱచి రక్షించి జాతీయతను దాని ప్రత్యేకపూర్ణ స్వాతంత్రమును అంతర్జాతీయార్థములకు లోనగునట్లు జేయగలది యగును.

"ఇంత క్రొత్తదయిన సమన్వయమందు గత సాదృశ్యములు నిశ్చయ సూచనలు కాగలవా యనిన్ని, దానియందుండి అధికాంత రంగికము గను స్వతంత్రము గను యుద్భవించి దాని సంశ్లిష్టతలకు సరిపోవునట్టి మఱియొకటి పరిణమింకూడదా

యనిన్నీ ప్రశ్నించవచ్చును. కాని మానవ జాతి క్రొత్త సమస్యలను సంధించునపుడు కూడ గతానుభవము పైననూ దానంజేసి గత హేతు సాదృశ్యములపైనను వర్తించును. క్రొత్త భావములను గ్రహించునపుడు సయితము వాని కదిగతమందాసంగిన రూపములయందే నడుచును. అతి ప్రాధాన్యమయిన విష్లములయందును తప్పించుకొనరాని ఈ యనిరామసూత్రము క్రొత్త పద్ధతి హృదయమందు విడువక నిలిచియుండుటను చూడగలము. ఇంతే గాక, ప్రత్యేక జాతీయాభిప్రాయ మంతరిం

చుటయో లేక అన్నియు సయోధ్యను గల్గియుండుటయో యను నీ రెండుశక్తులు కలిసి తమ వివాదమును పరిష్కరించు యేకమార్గ మగుచున్నది.

"గత్యంతరములేని యీ రెండుమార్గములునూ మేము కనిసించిన మూడు రూపములునూ తీవ్రాక్షేపణాలను తప్పించుకొన లేవు. కేంద్రీకృతమయిన ప్రపంచ రాజ్యము యాంత్రీకృతైక్యతాశయ విజయమునే సూచింపగల్గు. మానవ జీవితము యొక్క బలాభివృద్ధియందు త్రోసివేయ రాని యంశములయిన వ్యక్తియొక్క

స్వతంత్ర జీవనము జనులయొక్క స్వతంత్ర బహుళత్వములను మితిమీరి యణచుటయే తప్పనిసరి కాగలదు. అయ్యది స్థిరమయి తన సూచనల నన్నిటిని పూర్తి చేసినచో, జీవన వినష్టి స్తబ్ధతయందును, లేదా రక్ష యొనర్చు నాత్మపరిణామ శక్తివలన సర్వము ను విచ్ఛిత్తి గాంచుటయందును పరిసమాప్తి నొందగలదు. యాంత్రికోప భావము సులువుగా హేతువాద మభిమానించునది యగు. దాని పూర్ణవికాసము కోరతగినది, యవసరమైనది తప్పనిసరి యైనదిగా కన్పించవచ్చు. కాని దాని

యంతము మునుపే విధికృతమైనది. కేంద్రీకృతమైన సాంఘికరాజ్యము భవిష్యత్తునం దవసరమే కావచ్చు. దాని నుండి కల్గు ప్రతీకారము అట్లే అవసరమైనదగు. దాని యొత్తిడి జాస్తియగు కొలది విప్లవకారియగు అరాజికమునకు సంబంధములయిన ఆధ్యాత్మిక, బౌద్ధిక, ప్రాణిక, అనుభావిక సూత్రముల వ్యాప్తి చేనది యెదుర్కొనబడును. అటులనే కేంద్రీకృత యాంత్రికోప ప్రపంచరాజ్యము సయితము చివర కాలాటిశక్తిని తనపై కెగయ లేవనెత్తగలదు. సంయుక్త విధా

నము కూడ యొకే నమూనాకు చేరిన సంస్థలను ప్రక్రియలను తప్పనిసరిగా నిర్మించి స్వల్ప తేడాలు మాత్రము ప్రసరింపనెడమిచ్చు. కాని దానితో బహుత్వాకాంక్షియగు ప్రకృతి తృప్తినొందియుండజాలదు. గట్టిగా కట్టుబడని పరిసంఘము మధ్యాద్దామశక్తులకు సిద్ధోపకరణము కాగలదను ఆక్షేపణకు గురియై, స్థిరపడలేక, యేదోయొకవైపునకు తిరిగి, కేంద్రీకరణము నందుగాని లేక ఐక్యతావిచ్ఛిత్తి యందుగాని పరిసమాప్తి కాగలదు.

“జాతికి ఐక్యజీవనావశ్యకతను యెఱుక

పఱచుచు స్వతంత్ర సూత్రము నభిమా
నింప ప్రబల దోహదమొనర్చు నూతన
చైత్య-మానసికభావమే యావశ్యకమగు
రక్షణ దగ్రవ్యమగుచున్నది. జాతియొక్క
మత మానవైపును సూచించు ప్రవర్ధమాన
మగు శక్తిగా కన్పించుచున్నది. మానవ
ఏకత్వభావము నది కల్గియున్నది. జాతి
భావమును కల్గియున్నది. అయినను
మానవ వ్యక్తిత్వమును మానవ సమాజ
సాంఘీకరణమును ఆమోదించుచున్నది.
కాని దాని ప్రస్తుత బౌద్ధికరూపము అంత
చాలినదిగా కన్పించదు. భావము శక్తివంత

మైయున్నను జాతియొక్క జీవన సర్వస్వ మును తన బింబమువలె పోతపోయు నంత సమర్థముకాదు. మానవ స్వభావమందలి యహంకారమున కది యత్యధికమగు తా వొసంగుచున్నది. ముఖ్యముగ హేత్వర్థము పయి నాధారపడుచు యాంత్రికోప పరిష్కారమునకే మిక్కిలి తోడ్పడు చున్నది.

"జాతియొక్క ఆధ్యాత్మిక మతమే భవి ష్యత్తును గూర్చిన ఆశ. ఇట్లనిన బుద్ధితో గూడిన విశ్వాసవిషయమై సాధారణముగ విశ్వమయమతమును నది మా యుద్దేశము

కాదు. ఈ సాధనముచే నైక్యత సాధింప
మానవజాతి యత్నించినది. విఫలమైనది.
విఫలమునకే అర్హమైనది. ఏలన విశ్వ
మయ మతమనునది లేనేలేదు. అంతరాత్మ
యొక్కటియే. ఆత్మాభివ్యక్తి విధానము
నందలి బహుళత్వమును స్వతంత్రమును
ఆధ్యాత్మజీవన అన్నిటికన్న ఎక్కువగ
పట్టు పట్టుచున్నది. రహస్యాత్మయొక్కటి
గలదనియు, దానియందందరము యొక్కటే
యనియు, భూమియందు మానవత్వము
దాని యుత్కృష్టోపకరణ మనియు,
ఇక్కడ మానవునియందు జాతియందది

క్రమముగ నభివ్యక్తమగుచూ, ఈ జ్ఞానమందు జీవించి భూమిపయి దివ్యాత్మరాజ్యమును సాధింప హెచ్చగు ప్రయత్నము చేయవలెననియు, దీని యర్థము. మన జీవనసూత్రము ప్రధానముగ మన తోడివారల నందఱితోడి యేకత్వమేయగుచున్నది. సహకారసూత్రమందుమాత్రమే కాదు. అగాధమగు సోదరత్వము, వాస్తవము అంతరంగికమగు సమత్వ ఏకత్వ భావము అగుచున్నది. తన తోడిజనుల జీవనయందు మాత్రమే తన పూర్ణజీవనము కలదని వ్యక్తి యుపలబ్ధి గాంచవలెను.

వ్యక్తియొక్క సంపూర్ణము స్వతంత్రమగు జీవనయందే తన స్వీయసిద్ధి సుస్థిర సౌఖ్యము నెలకొనబడగలవని జాతి యుపలబ్ధి గాంచవలెను. ఈ మతమే ముక్తికి మార్గము కాగలదు. దీనియందిమిడియున్న దాని నంతయు విపులము చేయవలెనన్న ఇక్కడ తలపెట్టరానంత గొప్ప కృషి కాగలదు. తుదిమార్గ మీఛాయనే యున్న దని సూచించిన చాలును. మిగత యన్నిటివలె నిదియు నొక భావమే అయిన యెడల అన్ని ఆశయముల త్రోవనే ఇదియు పోగలదు. మన జీవనమందలి సత్యమే మైన

యెడల సర్వము దేనికొఱకై యత్నించు చున్నదో ఆసత్యమే కావలెను. దానియందు ప్రాధాన్యము, ఆంతరంగికము, పూర్ణము, వాస్తవ మగు మానవైక్యతను సిద్ధింప జేయు సాధనమును కనుగొనగలము. చైత్య-మానసిక ఏకత్వమును సృజించు ఆధ్యాత్మిక ఏకత్వము జీవన ఏకత్వమునకు బలమగు ప్రాపక మొసంగి ఉత్తమతరమగు మానవజీవనకు పునాది కాగలదు.

"జాతీయం దీ వికాసము శీఘ్రముగ గల్గినచో ఐక్యతను గూర్చిన సమస్యను వాస్తవ మార్గమున అంతస్సత్యము నం

దుండి బాహ్యారూపము వఱకు పరిష్క
రింప గలము. అంతదనుక యాంత్రికోప
సాధనలచే దానిని సాధించు యత్నము
సాగవలెను. ఈ సత్యమును యుపలబ్ధి
గాంచి, తమయందు వికసింపజేసి, యాంత్రి
కోప దృక్పథమునుండి మానవుని మనస్సు
విముక్తిగాంచ సిద్ధంబయినచో, ఆత్మసత్య
ము ప్రవేశించి జాతిని సాధ్యముకాగల
యుత్కృష్టసుఖము సంసిద్ధి వీనికి కొనిపో
గలదు.”

ఈ గ్రంథము పుస్తకరూపమున ప్రచు
రించుటకు పూర్వము ముప్పది సంవత్సర

ములకు పైబడిన కాలమునందు వ్రాయ బడిన దగుటచేతను, మధ్య కాలములో రెండవ ప్రపంచ సంగ్రామము లోనుగాగల పలు మహత్తర సంఘటనలు జరిగియుండి యుండుటవలనను, ప్రచురణ కాలమున యీ విషయముల నన్నిటిని, 'రచనోత్తర' మను ఆధ్యాయమున సమగ్రముగ పరిశీ లించి వ్రాసిరి. దాని యందలి భాగాను వాదముకొంత నిందు జతపఱచుచున్నాము.

"ప్రస్తుత ప్రపంచ పరిస్థితులలో నత్యవ మాన దాయకమగు విషయములను అపాయకరములగు సాధ్యతలను పరిశీలించి

నప్పుడు సయితము యేదో యొకవిధమగు ప్రపంచ–ఐక్యత అవసరము తప్పనిసరియని, మేమవలంబించిన యీ లోకనమును మార్చ నగత్యమేమియు లేదని, మేము తీర్మానించుచున్నాము. ప్రకృతి గతిప్రవాహమును, పరిస్థితుల బలత్కారమును, మానవజాతియొక్క భవిష్యద్వర్తమానావశ్యకతయూ దాని ననివార్యమైనదిగ చేయుచున్నవి. మొత్తము పయి మా తీర్మానము లన్నియును, హేత్వర్థాభిమాన రూపములును, యొకటిగాక మఱొకటి లేక యొకటివెంట నొకటి వికసింప

నది గైకొను సరణులునై నిలువగలవు. తుది ఫలితము ప్రపంచ రాజ్యనిర్మాణమే కావలెను. అన్ని విధములగు పరాధీనతలును బలత్కార నియంత్రితమగు మానత్వమును యొకరికొకరు లొంగియుండుటయును ఇవి మొదలంట నశించిపోయిన స్వతంత్రజాతుల పరిసంఘమే కాగలదు. కొండ అధికమగు నైజప్రభావ ముంచుకొన గల్గినను యందఱును సమానస్థితినే గల్గియుందురు. అనిబద్ధసమాఖ్య ప్రపంచరాజ్యమునకు చేరిన జాతులకు యపారమగు స్వతంత్రము నియ్యగలదు, కాని యిది మధ్యా

గ్గత లేక ఆత్మ విభాగ సూచనలు పనిచే యుట కెడమియ్యగలదు. పరిసంఘ మట్లగు టచే సర్వత్ర వాంఛనీయమైనది. మిగిలిన దంతయు సంగతి సుగమనంబు వలనను, భావముల కొసంగబడిన సాముదాయక సమాధాన స్వరూపముల వలనను, భవి ష్యత్తులో పెరుగగల యావశ్యకతల వలన ను నిర్ధారణ జేయబడగలదు. ఈ విధమగు ప్రపంచ సమాజము చిరకాలము జీవింప గలదు, స్థిరస్థాయి నొందగలదు. ఇది క్షుర మగు జగత్తు. కొంత కాలము వఱకు అనిశ్చయములు ఆపదలు యెదుర్కొని

బాధించగలవు. నూతన భావములు శక్తులు బయల్పడి విప్లవకర సూచనలకు నిరూపింప బడిన నిర్మాణమునకు లోనై, మానవ జాతి మానసముపయి వాని ప్రభావమును చూపించగలవు కాని, ప్రధాన కర్తవ్య కార్యము పరిగృహీతంబయినది. జాతి యొక్క భవిష్యత్తు నిశ్చయింపబడినది. మానవైక్యతాశయము యిూ డేర్చబడని, సఫలము కాని ఆశయమే కాక నిర్వహింప బడిన విషయమై దాని సుసంరక్షణము ఐక్యతంగాంచిన మానవుల వశము చేయ బడినది. దాని భవిష్యత్తు దేవతల చేతిలో

నుండగలదు. జాతియొక్క స్థిర జీవనను దేవత లుపయోగింప గల్గిన అక్కడ సుర క్షితముగ విడువవచ్చును."

"మా యీవ్యూహము, పన్నుగడ, యిప్పటికి ప్రధాన సూత్రములను మాత్రము సమగ్రముగ వివరింప నెడ మిచ్చినది."

జగదోద్ధారణకై మూర్తీభవించిన దైవము, జగత్పావన పుణ్యమూర్తియగు శ్రీఅరవిందులు మహోత్తమ ద్రష్టయై మానవజాతి జీవనపరివర్తనమును గాంచి నూతన యుగాగమన తత్పరతంజెంది దివ్య

జీవనోన్ముఖంబయి పురోగామి యగుటకు
సత్యం ఋతం బృహత్తను—విజ్ఞానము—
పరమనస్సు—భౌతికమునందవరోహించుట
తప్ప గత్యంతరము లేదనియు దాని యవ
రోహణము తప్పనిసరి యనియు దివ్య జీవ
నంబను బృహతత్త్వ శాస్త్రము నందు
సుదీర్ఘముగ ప్రవచనముచేసి, వ్యక్తి యీ
సత్యచేతనకెట్లు తా నారోహించునది
యోగసమన్వయము నందు విపులపఱచి,
సంఘు మీ దృక్పథమునుండి యేలా పరి
వర్తనము గాంచవలసినది మానవయుగ
మను సంఘ వికాస తత్త్వమందు నిరూ

పించి, జాతియంతయు నైక్యతసిద్ధి నేలా బడయగలది మానవైక్యతాశయ మందు సూచించి, పరిణామమందలి తుది లక్ష్యమైన విజ్ఞానము లేక పరమనస్స్వరోహణచే మాత్రము ప్రతిష్ఠింపబడగల దివ్యజీవనము ప్రాచీన వేదాంత సత్యములకన్న భిన్న మైనది కాదని రూఢి పఱచుటకు వేదరహ స్య మను వ్యాసములలో వేదఋషు లుప యోగించిన సాంకేతికముల పరిశీలనము చేసి యవి తెలుపు భావములను స్ఫుటముగ తేల్చి వేదము ప్రతిపాదించునది అమృ తత్త్వము దివ్య జీవనమని తేటపఱచి, ఈ

దృక్పథమునుండియే ఈశ - కేన యుపని షత్తులకు భాష్యములు వ్రాసిరి. శరీరధారి కర్మ యొనర్చుచూ యాత్మయం దెట్లు జననంబందగల్గి పరమశాంతిని అవ్యయ పదమును యెట్లుజేరునది గీతావ్యాసముల యందు సూచించిరి.

ఈ కేనోపనిషద్భాష్యము చాలాపెద్దది. దీనిని తెనిగించ నవసరంబయిన సాధన సంపత్తి,ఉభయ భాషా ప్రవీణత, వ్యాఖ్యాటి, రచన సౌష్టవము; అన్నిటికన్న మిన్నగ శ్రీఅరవిందుల తత్త్వోపలబ్ధి యివన్నియు శ్రీవారియందలి భక్తి శ్రద్ధలు తప్ప మా

కించుకేని లేమింజేసి మూలము మాత్రము శ్రీ వారి ఆంగ్ల అనువాదము తెనుగు అర్థముతో ప్రచురింపబూనినాము. భాష్యము పూర్తిగ లేనిదే తమ దృక్పథమునుండి శ్రీ అరవిందు లేలా సమర్థించినది బోధపడదు కాన శ్రీవారి యీ వ్యూహ మందలి లక్ష్య మేమైనది దానిని సిద్ధి బొందుటకు సాధన విధాన మేమైనది అదియే సత్యములపయి నాధారపడినది తెలుప వలసిన, యవసర మేర్పడినది. ఈ విషయముల నీ తొలిపలుకునందు సమగ్రముగ వివరింప ప్రయత్నించితిమి. జీవు డహం

కార బద్ధుడు. ఈ బంధమును త్యజించి ఆత్మయందైక్య మయి ఆత్మశక్తిచే తన సర్వ సత్తా-నుయెల్ల భూమికలతో కూడిన పురుషుని—పూర్ణము గావించి, తనయం దాత్మ యభివ్యక్తమగుటచే సర్వజీవులను జగత్తంతయు తనలో దర్శించి దానంజేసి కేవలానందభరితుడై, మార్గమందు నివిష్టు లయినవారికి తోడ్పడుచు, సంఘము సయిత మాత్మాయత్త మగుటకు తోడ్పడి, ఆ తీరుననే జాతియంతయు ఐక్యతంగాంచ సాయంబొనర్చి, స్వతంత్రము ఐక్యత సమ రసముల నెలకొల్పి,జగత్తంతయు దైవము

యొక్క బింబముగ జేసిననే నవయుగా గమనంబగు. మఱొకమార్గము లేదు. ఇదంతయు సృష్టిహేతువైన పరమనస్సు యిప్పటివలె మఱుగుననుండికాక బాహాట ముగ భౌతికమందు సయితము వర్తింప మొదలిడిన నెల్ల వక్రతలు పాపములు క్షయించి యాత్మశక్తియగు నా పరమన శ్శక్తిచే వాంఛనీయంబయిన వాని యన్ని టితో సంశోభితంబయి స్వేచ్ఛ, సమత్వ ము, భాతృత్వము ఐక్యత సంపూర్ణతలతో తులతూగి ఇక్కడ ఇహమందే యీస్థితి సాధింపబడుటయే నూతన యుగాగమ

నము. దీనికి కీలకము పరమనశ్శ క్తి-లక్ష్య ము-ఆత్మ. ఇదే శ్రీఅరవిందుల నిజత త్త్వ స్వరూపము సూక్ష్మముగ. దీనిని త త్త్వతః కొంతకు కొంతైన నెఱింగితిమేని కేనోపని షత్తునందలి భావసరణి యిందు చేర్చి యున్న భాష్య సంగ్రహానువాదము నుండి బోధపడగలదని నమ్ముచున్నాము.



# ఉ ప సం హా ర ము

క్రీస్తుశకము పందొమ్మిదవ శతాబ్ద మూడవపాద చివరకాలమది. బ్రిటిషు ప్రభుత్వాధికార బంధనమును తొలగించు కొన నిండియనులు చేసిన తుది సాయుధ తిరుగుబాటు నణచి బ్రిటిషు సామ్రాజ్య ములో నిండియానప్పుడప్పుడే కలుపుకొన్న సమయమది. భౌతిక-పదార్థ-శాస్త్రపరిశీ లన పటిమ వలనను పరిశోధనానుభవ శాస్త్రముల నుపక్రమించి వానియందపార

విజ్ఞతంబడయుటచేతను పాశ్చాత్త్యులెల్ల
డల ప్రకృతిశక్తుల వశపఱచుకొని బాహ్య
జీవనవికాస మింతింతయనరాని యౌన్న
త్యమునకు గొనిపోయి తమ జయోత్సా
హములచే ప్రాక్దేశీయుల దిగ్భ్రమనొంద
జేసి ఇండియనులనే గాక మిగత ఆశియా
దేశీయుల నందఱిని రాజకీయముగ పరా
ధీనులం గావించి యంతటితో విడువక తమ
తమ స్వీయసంస్కృతుల సయితము విస్మ
రించి భయావహంబయిన పర ధర్మ మవ
లంబింపజేసిన యుగమది. 'బాహ్యజీవన
మొక్క క్షణంబగురములగు విచిత్రములచే

కండ్లు భ్రమింపజేసినట్టి భౌతిక, యాంత్రిక పరిజ్ఞాన జయభేరులచే చెవులు బధిరము కావింపజేసినట్టి' పాశ్చాత్యులు తమలో తాము సౌజన్య సౌహార్దముల గోల్పోయి యొండొరుల యెడ వైషమ్యాసూయ భావముల పెంపుజేసికొనుచు కయ్యమునకు కాలుదువ్వుచున్న రోజులవి. ప్రాక్దేశము ముఖ్యముగ నిండియూ మేల్కొనుచున్న యుపకాలమది. 'ఉత్కృష్టాధ్యాత్మిక మహాపురుషుడగు శ్రీరామకృష్ణపరమ హంస' మహత్తరంబగు నాధ్యాత్మిక ప్రవాహమును ప్రతీచిపయి మరలించి

తీవ్రపిపాశితులగు పాశ్చాత్యుల పునీతుల గావింపనోపిన భగీరథులకై వేచియున్న తరుణ మది. జగమంతయు బ్రహ్మమే యైయ్యును జీవన నంతకంత పరిత్యజించి బ్రహ్మయందైక్యత గాంచుటే మానవుని కర్తవ్యమని గట్టిగానమ్మిన ఇండియాయు, జగన్మూలమవేద్యము అవిజ్ఞేయ మగుటచే తా నాత్మను పరిత్యజించి జీవన వికాసమే ప్రధాన కర్తవ్యముగ నమ్మిన ప్రతీచియు, జీవనను యాత్మశక్తితేజములచే వికసింప జేయుటయే కర్తవ్యమని గ్రహింపనున్న సంధ్యాకాల మది. అట్టి ఈ తరుణమున

తీవ్రపిపాశితులగు పాశ్చాత్యుల పునీతుల గావింపనోపిన భగీరథులకై వేచియున్న తరుణ మది. జగమంతయు బ్రహ్మామే మైయ్యును జీవన నంతకంత పరిత్యజించి బ్రహ్మయందైక్యత గాంచుటే మానవుని కర్తవ్యమని గట్టిగానమ్మిన ఇండియాయు, జగన్మూలమవేద్యము అవిజ్ఞేయ మగుటచే తా నాత్మను పరిత్యజించి జీవన వికాసమే ప్రధాన కర్తవ్యముగ నమ్మిన ప్రతీచియు, జీవనను యాత్మశక్తితేజములచే వికసింప జేయుటయే కర్తవ్యమని గ్రహింపనున్న సంధ్యాకాల మది. అట్టి ఈ తరుణమున

(సర్వోత్కృష్టమగు, సృజనశక్తివలన) యవత రించెద'నని పల్కెను గాన కేవల ధర్మ స్థాపనమేగాక జాతి తనను, భగవంతుని, చేరజేయజాలినత్రోవను ప్రస్ఫుటముగ తానసుసరించి చూపెట్టుట దుష్కృతు లను వినాశముజేయ సుకృతుల నియో గించి ఉత్సహించుట యనునీ మహాత్కా ర్య నిర్వహణమునకే భగవంతుడు శ్రీ అరవిందమూర్తియై యీనాడవతరించె.

ప్రాక్పశ్చిమములని రెండుగా విడిపోయి విభిన్నమార్గములుగ పరిణమించిన మాన వ సంస్కృతి నాదినుండి సమరసమొనర్చి

ప్రాక్పశ్చిమ జాతులనన్నింటి నైక్యమానవ జాతిగ నొనర్పజాలిన భావముల సూచనల విపులముగ నిరూపింపవలసి యుండెను గాన పాశ్చాత్య సంస్కృతియందు ప్రత్యక్షానుభవము బడయుటకే చిరుతవయస్సననే యింగ్లాండునకు జేరి ఇండియను సివిల్సర్వీసు పరీక్షకు చదువుట యొక నిమిత్తముమాత్ర మగుచున్నదికాని తండ్రి యనుకొనినట్లు బ్రిటిషుపాలకవర్గమును చేరి యున్నతపదవి నలంకరించుట కానేరదు. జన్మతః తమ సంస్కృతి హైందవ వ్యుత్పన్నతకు చేరినదైనను బరోడాయందున్నకాల

మున ముఖ్యముగ నిండియూ విముక్తికొఱ
కైన విప్లవ క్రియాకలాప సన్నాహము
నందే నిమగ్నులయి యున్నను విశుద్ధార్య
సంస్కృతి సంగ్రహణముననే గడుప నిమి
త్తంబయినది. చివరికీ ప్రాక్సంస్కృతియం
దనుపమ ప్రత్యక్షానుభవము గాంచుటకే
కారాగారవాసమునూ నిమిత్తమైనది.
అప్పటినుండి తాము చేయనున్నదియు
దానిని నిర్వహించు మార్గమును స్ఫుట
ద్రష్టమగుటచే నా పనియందే నలుబది
సంవత్సరముల కాలము గడపిరి.

ఈ మహాత్కార్యక్రమ మేమైనది తమ

జన్మదినమును ఇండియా స్వతంత్రము గాంచిన రోజయిన 1947-వ సంవత్సరము ఆగష్టు15-వ తేదీన శ్రీవారొసంగిన సందేశమునకలదు. ఇది యైదు తెరగులు. ''ఒకటి, ఇండియా పరాధీనతనుండి విముక్తమయి స్వతంత్రమును ఐక్యతయు గాంచుట; రెండు, ఆశియాయును స్వేచ్ఛనుగాంచి పూర్వమందువలె మానవజాతి యభివృద్ధికి తోడ్పడుట; మూడు, జాతియంతయు తమ తమ ప్రత్యేక జాతీయజీవనను గోల్పోక సమ్యక్సం పూర్ణైక్యతనుగాంచుట; నాల్గు, ఇండియా తన యాధ్యాత్మికజ్ఞానమును,

జీవనను ఆధ్యాత్మికము జేయు సాధనను, మానవజాతికంతయు నొసంగుట ; ఐదు, చేతనను యొక యున్నతస్థాయికి గొనిపో వుటచే మనుజుని నాదినుండి యెదుర్కొనెడు సృష్ట్యంతర్గత గూఢసమస్యల నన్నింటి వి ప్పగల పరిణామమందలి క్రొత్త మెట్టునూ."

వీని నెంతవఱకు సాధించినది ఆ సందే శము నందే కలదు. "ఇండియాకు స్వతం త్రము వచ్చిన దే కాని అది ఛిద్రము విచ్ఛిన్నమైన స్వతంత్రము......ఆశియా మేల్కొన్నది. చాలాభాగములు విముక్త ములైనవి తక్కినవి రేపోమాపో స్వతంత్ర

ము గాంచ గలవు.........జాత్యైక్యత త్రోవకు వచ్చినది. అసమగ్రముగ నైనప్పటికి సాంగోపాంగముగలదై మిక్కుటమగు కష్టముల నెదుర్కొనుచున్నది...ఇండియా నుండి ఆధ్యాత్మికప్రదాన మప్పటికే ప్రారంభమైనది...కాలవాహిని యందలి విపత్తు లధికాధికుల దృష్టిని ప్రబోధములవైపేగాక చైత్యాధ్యాత్మిక సాధనలవైపు కూడా మరల్చు చున్నది......కడపటిది యింకా ఇండియాయందును ప్రతీచి యందును దూరదృష్టిగలవారల వ్యక్తిగతాశయు, ఆశయము, లక్ష్యమే. ఇందునూ

కష్టము లనేకములు, దుర్ఘటములు. కాని తీవ్రసంకల్ప మున్నచో వానిని దాటగలము. ఇదియు నాత్మ యంతచ్చేతనాభివృద్ధులచే గల్గకూడినది గాన ఇండియా నుండే ప్రారంభించి సాగవలెను. విశ్వమంతయు వ్యాపింపవలసినదైనను ఇండియాయే యీ యత్నమునకును కేంద్రము కావలెను.''

ఈ మహాత్మాార్యముల బాల్యమాదిగ సంకల్పించి ఇప్పటికి ఫలింప ప్రారంభించుటను చూడగల్గిన శ్రీవారు, ఇవన్నియు నిండియా స్వతంత్రమున కనుసంధానము

లును ఇండియా భవిష్యత్కార్య కలాపము లకు చేరినవియు యని యుద్ఘోషించినారు.

స్వతంత్రసిద్ధి కల్గిననే ప్రాగ్దేశములు తమ నిజ సంస్కృతియందు వికసించి జీవనసత్యము నెడ ప్రబోధముగాంచి యాత్మ జ్ఞానము నద్దానితో క్రొత్త పొందిక గల్పింప సమర్థములగును. ప్రతీచియు నాత్మసత్యమునకును అధ్యాత్మజీవనసాధ్యతకును ప్రబోధము గాంచినగాని జాత్యైక్యత గాంచ లేదు. కావున విముక్తినొంది నిజ సంస్కృతియందు పూర్ణ వికాసము

గాంచిన ప్రాగ్దేశములందు ఇండియా
ముఖ్యముగ ప్రతీచికి తన యధ్యాత్మ
జ్ఞానమునే గాక జీవనను అధ్యాత్మికము
జేయు సాధనను యొసంగ నవసర మేర్పడి
నది. ఈ విశ్రుతకార్యమున కేకైక సాధ
నము పరమనస్సత్యావతరణమే తప్ప మ
ఱొక త్రోవ లేదు. పుడమిపయి జీవన
పరివర్తనమొనర్చి నూతన యుగాగమనో
పాయములుగ వ్యక్తి సంఘ జాత్యభ్యు
దయ ఐక్యతలను గడించుమార్గము యాచ
రణయం దెట్లు నీడైదు క్రియా కలాపము
లుగ వర్తించినది శ్రీవారు సూచినారిందు.

ఈ మహోత్కృష్ట కార్యములను 'బాల్యమాదిగ సంకల్పించి యిప్పుడిప్పుడు ఫలింప ప్రారంభించుటను చూడగల్గితి' నన్న జగత్పావన పుణ్యమూర్తియైన శ్రీ అరవింద యవతారమూర్తి యుత్క్రమణము 1950-వ సంవత్సరము డిశంబరు 5-వ తేది ఉదయం 1-26 గంటలకు.

ఈ యుత్క్రమణమునకు కారణమేమి? అంతర్భావమేమి? పర్యవసానార్థమేమి? యను నీసమస్యలు శ్రీవారి మార్గావలంబులగు యంతేవాసులనే గాక ప్రజల నందఱి నెదుర్కొనుచున్నవి. 'నా జీవి

తము బాహ్యమున మనుజులు చూచుటకు వీలుగా లేదు కాన నన్ను గురించెవ్వరును వ్రాయలేర'ని శ్రీఅరవిందు లొకచోట వ్రాసియున్నారు. అంతర్నిహితము అంతర్వ్యాప్తితము నగు శ్రీవారి జీవన విశేషమునకు చేరినదే యీ యుత్క్రమణము ను. దీని రహస్యమును తెలిసికొనుట మన తరముకాదు. 'తెలియనిచో యూరకుండుట మేల'ని శ్రీతల్లిగారొకచో నుడివిరి. అయినను శ్రీవారి రచనలే యంతకు మించిన సహాయసంపద – తాదాత్మ్యసిద్ధి – లేనప్పుడు కొంతకుకొంత సమాధానమును

సూచింపగలవు.

సృష్టివిధానమును గూర్చిన శ్రీవారి సిద్ధాంతమిది. "ఆత్మసృష్టికి మూలమే గాక దాని నంటియుండు సత్యమును దాని తుది ఫలితమునై యున్నది. అయ్యది చింత్యము, అవ్యయము, అనంతమయిన కేవలమే గాక సచ్చిదానందమును అగుచున్నది. సత్-సత్యము, చిత్-తపము, ఆనందము-జనః; సత్యము, చిత్శక్తియుతము, ఆనందమయమగు పురుషుడు. ఈ పురుషుడే భూమిని విశ్వమునంతయు చుట్టుకొని పదంతలు మించియున్నాడనియు, విశ్వము

భూతములు యీ పురుషునిలో నొక్క-పాదమనియు, అమృతము స్వర్గము మిగత మూడు పాదములనియు వేదము ఘోషించు చున్నది. సువిస్తారమగు నీ విశ్వము సృజింప బడుటకు పూర్వము, వ్యక్తముకాక ముందు,యీ పురుషుడు-బ్రహ్మము-ఆత్మ-ఏకంసత్ అనియు సచ్చిదానందము లేక సంక్షేపముగ చెప్పునెడ ఆనంద మనబడు చున్నది.

"ఈ విరాట్టునందు 'బహుస్యాంప్రజాయేయేతి' యను ఆనందేచ్ఛ కల్గగనే త్రైకమైన సచ్చిదానందము, సత్-చిత్-

ఆనందము అనుత్రికము, విడివడని త్రయ
మగుచున్నది. అభివ్యక్తము కానున్న
వానిని తెలిసికొను సర్వజ్ఞత, అభివ్యక్త
ము చేయజాలిన సర్వశక్తిత్వము, అభివ్యక్త
మగుటయందలి యనంతానందము లా
విర్భూతను వదలని త్రయంబయి యిచ్ఛా
గ్రహణ జ్ఞానములను మూడగు ముఖ్య
మనోసూత్రములను కల్గియుండుట చేతను,
అయ్యవి పరమునకు చేరినవై స్వతఃసిద్ధ
మగు యపార శక్తియుతములగుట వలనను,
యింకను త్రైకంబయిన త్రయంబను విజ్ఞా
నము-పరమనస్సు-సత్యం ఋతం బృహత్తు

–సత్యచేతన, యవరోహణ ప్రక్రియ యందలి ప్రథమ సోపానము, పరమును సృష్టిని సంధానమొనర్చు సంధానసూత్రము, మహః వెలువడినది.

''సత్–చిత్–ఆనందముల యందు చివరది యైన జనః–ఆనందము– బహుత్వము నొంది యేకత్వమును గోల్పోని భిన్నదైవములయొక్క, విశ్వ దేవతల యొక్క, నిలయమగు యతిమనస్సను పరమనస్సు యొక్క ప్రతినిధి, యవరోహణ ప్రక్రియ యందలి రెండవ సోపానముగ యేర్పడినది. ప్రత్యేకత ప్రాధాన్యమును వహించి

ఏకత్వము దూరీకృతముకాని స్థాయియిది.

"అతిమనస్సునందలి మూలసూత్రమైన యేకత్వమును గోల్పోని బహుత్వము ప్రత్యేకత ప్రధాన్యము వహించుటచే నయ్యదిప్రత్యేకత స్ఫుటమగుకొలది తాదాత్మ్యజ్ఞాన-స్వతఃస్ఫురణ-మనస్సను అవరోహణ ప్రక్రియ యందలి మూడవ మెట్టుగ పరిణమించుచున్నది. ఇందు దైవము-పురుషు డంతర్నిహితంబగుట యంతర్వ్యాహృతంబగుట ప్రారంభమైనది.

"ఈ యంతర్నిహితత్వము మఱీ గాఢమగుకొలది స్వతఃస్ఫురణ మనస్సునందుండి

ప్రకాసితమైన మనస్సు అవరోహణ ప్రక్రియ యందలి నాల్గవ సోపానముగ వెలువడుచున్నది. ఇందు తాదాత్మ్యము సన్నగిలి ప్రకాశ ప్రభావము మాత్రము ప్రాముఖ్యమును గాంచుచున్నది.

"పురుషాంతర్నిహితత్వ మింకను జాస్తియగుచోలది ప్రకాసితమైన మనస్సునందుండి యున్నతతర మనస్సు అవరోహణ ప్రక్రియయందు ఐదవ సోపానముగ వెలయు చున్నది.

"ఇంతవఱకు అజ్ఞానమునకు యెడ మేర్పడలేదు. ఆనందము క్రమముగ నంతర్నిహి

తం బగుచున్నదే కాని ప్రత్యక్షప్రభావము ప్రసరింపజేయుచునే యున్నది.

"అంతర్నిహితత్వము యంతర్విలీనము గ పరిణమించి ప్రత్యక్ష ప్రభావము తొలగు కొలది యున్నతతర మనస్సు నందుండి మనస్సు యవరోహణ ప్రక్రియ యందలి ఆఱవ సోపానముగ యేర్పడుచున్నది.

"చిత్శక్తియందలి చిత్-చేతస్సు-అంతర్నిహితంపగుచో శక్తి ప్రాణమయంబయి యవరోహణ ప్రక్రియయందలి యేడవ సోపానముగ విలసిల్లుచున్నది.

"చిత్తింకను అంతర్విలీనంబగుచో

ప్రాణము కేవల విశ్వశక్తిగ మారి ఆకాశ మగుచున్నది. సచ్చిదానందము నందలి చేతనానందములు సృష్టి విధానమున క్రమముగ యంతర్నిహితములు యంతర్విలీనము లగుటచే నాత్మ ఆకాశ రూపము దాల్చినది. ఆత్మనః ఆకాశస్సంభూతః.

“విశ్వశక్తియగు నీ భౌతికశక్తియందలి స్పందనము, సంక్షోభము, తగ్గుకొలది క్రమముగ వాయువును, అగ్నియు, ద్రవపదార్థమును చివరకు ఘనమగు భౌతిక పదార్థము—భూమి—ఏర్పడినవి. అనగా ప్రాణశక్తి క్రమముగ యంతర్నిహిత మగుకొలది

పరమునందలి సత్తు మాత్రము మిగిలినదై స్థూల పదార్థముగ పరిణమించినది. ఇది యవరోహణ ప్రక్రియయందలి తుది సోపానము.

"భౌతిక పదార్థమునం దంతర్నిహితమై యున్న ప్రాణశక్తి ప్రాణమయము వలని యొత్తిడివలన బహిర్గతమగుట కుద్యుక్త మగుచో పదార్థాణువులు జీవాణువులుగ మారి ప్రాణవిచేష్ట కనువగు భౌతికాధార ముగల వృక్షజాతి, యోషధినిచయ, ముద్భవించినది. ఇది యారోహణ ప్రక్రియకు మొదటిమెట్టు.

‘‘మనోమయలోక యొత్తిడివలన ప్రాణమం దంతర్నిహితమైన మనస్సు యతి ప్రాథమికస్థాయియందు బహిర్గతమగుటకు మొదలిడుచో క్రిమికీటక పశుపక్ష్యాది జంతుజాలముత్పన్నమైనది. ఇది యారోహణ ప్రక్రియయందలి రెండవమెట్టు.

‘‘మనోమయము యొక్క యొత్తిడి జాస్తియగుకొలది శరీర ప్రాణములయం దంతర్నిహితమైన మనస్సు బహిర్గత మగుచో మానవు డుద్భవించె. ఇది యారోహణ ప్రక్రియయందలి మూడవమెట్టు.

‘‘ఈ మనుజుడు సాధారణముగ భౌతిక

పదార్థముచే పోషింపబడు శరీరమును—అన్నమయకోశమును—దాని నంటియుండు అన్నమయపురుషుడును, శరీరాశ్రితమైన ప్రాణకోశమును దాని నంటియుండు ప్రాణమయ పురుషుడును, శరీర యుపరిస్థితమైన మనోకోశమును దాని నంటియుండు మనోమయ పురుషుడును, వీనితోకూడినవాడై యున్నాడు. మనోమయకోశ పురుషులింకను పూర్ణ వికాసమును గలిగియుండలేదు. ఈ వికాసము జ్యోతిర్మయ మనోవర్గములగు ఉన్నతతర మనస్సాది మనోచతుష్టయమున కారోహించుకొలది

కల్గును. ఆవల విజ్ఞానందమయ కోశములు పురుషులు ప్రతిష్ఠితములగు. ఈరీతి ఆరోహణ ప్రక్రియ క్రమముగ తుదిమెట్టును చేరును. అంత సర్వకోశములతో కూడిన పూర్ణ పురుషత్వమేర్పడు నిక్కడ, యిహమందు యీ శరీరముననే.

"ఈ పరిణామమంతయు నొక్కసారిగ జరుగదు. అనేక కాలము పట్టును. కావుననే పునర్జన్మల యవసరమేర్పడినది. జనన మరణాములు సిద్ధికిగాను యేర్పడినవే కాని, ప్రతిబంధకములు కావు.

"కేవలమగు ఆత్మ నామరూపములతో

నభివ్యక్తమగుట కీ యవరోహణ యారో
హణ క్రియాత్మకమైన సృష్టి యేర్పడినది.

"మఱొకవిధమున చూచినయెడల నీ
సృష్టియంతయు నిశ్చేతనము, అధశ్చేత
నము, చేతనము, అధప్రకాశ చేతనము,
పరచేతనము, వీనితో కూడినది అని తెలి
య నగును. అధిభౌతికమంతయు నిశ్చేత
నము ; అధిదైవతము అనగా మనఃప్రాణ
ములతో కూడినది అధశ్చేతనము, చేతన
ము, అధప్రకాశచేతనమగు; అధ్యాత్మము
పరచేతనము ; సర్వజగత్తుయొక్క యెల్ల
జీవులయొక్క వర్తనము నిశ్చేతనము

మొదలు పరచేతనము వఱకుగల చేతనాబ్ధి పంచకముపయి నాధారపడియున్నది. వాని యందుండి బయలుదేరుచున్నది.”

సృష్టివిధానం బిదియగుటచే ఆత్మయే-సచ్చిదానందమే-జగత్తునకు మూలమును దాని నంటియున్న సత్యమును దాని తుది ఫలమును అగుచున్నదనుట తేటపడగలదు.

ఎల్లజీవులు తామాత్మాభివ్యక్త కేంద్రములని గుర్తించి యన్నియు నాత్మబింబములగువఱకు జ్ఞానాభివృద్ధిగాంచుటే తమ ధర్మమని యెఱుగవలెను. ఒక్కొక్క కాలమందు, ఆరోహణము మనస్సుతో నిలిచి

జ్యోతిర్మయ మనో ప్రభావమింకను ప్రస రించని కాలమందు, మానవులీజ్ఞానమును గ్రహింపజాలరు. దీని నెఱుక పఱచుట కీశ్వరు డాయా కాలములకు తగిన ట్లవత రించి కర్తవ్యాంశమును దానిని సమ కూర్చు మార్గమును చూపెట్టును. 'అవజానంతి మాం మూఢాః మానుషీం తనుమాశ్రితం' మనుష్యరూపము దాల్చిన నన్ను, ఈశ్వరుని, మూఢులు తెలిసికొన లేరు, సర్వభూతములకు మహేశ్వరుడైన నా మహద్భావము నెఱుగజాలరు గాన; సాధారణముగ యీశ్వరుని మహద్భావ

నిజతత్త్వస్వరూప మెఱుగని సమకాలికులు యవతారమును గుర్తింపకపోవుటలో చిత్రమేమియు లేదు.

జడమునందు, భూమియందు, సత్య చేతన — పరమనస్సు — యవరోహించి యందు యిప్పటివలె మరుగునగాక బాహాటముగ వర్తించుటకై తాను కృషి యొనర్చినది, యొనర్చుచున్నానని శ్రీయరవిందులు నుడివినది సత్యము. ధాత్రిపయి దివ్యజీవన నెలకొల్ప నేకైక సాధనమగు సత్యచేతన యొక్క స్వరూప మేమైనది 'దివ్యజీవన'మందలి కడపటి రెండధ్యాయ

ములలో తెలియపఱచినారు. మానవజాతి పరిణామమందలి ప్రస్తుతపు క్లిష్టపరిస్థితిని గూర్చి ఇందిట్లు వ్రాసినారు.

"భౌతిక ఆర్థిక జీవనమునకు అత్యధిక ప్రాముఖ్యత నొసంగు యీకాలపు ఆశయము మనుజుని అధ్యాత్మికము నందు వెనుకబడి, భౌతికజీవనమునందు మాత్రము వ్యాపకము జెంది, అభివృద్ధినొందిన మానవజాతి మనస్సంపదయును, పూర్ణ వికాసము నొందిన వస్తుపరిజ్ఞాన శాస్త్ర సహాయమునుగల్గి, తన యాద్య కిరాతస్థితి యందు పునర్జన్మమెత్తిన నాగరికతకు చేరిన

దే యగును. ఈ యొక్కటా లేక ముఖ్య మగు ప్రాధాన్యత మానవజాతికిని పరిణామమునకే విపత్కరమగుచున్నది. నాగరికమగు రూపముతో వెనుకటి ప్రాణిక భౌతిక యాద్యకిరాతకత్వ పునరుద్భవము మొదటి విపత్తు. దీనిని మన చుట్టంతయు చూచుచున్నాము. ముక్తిదాయకమగు ఆధ్యాత్మికాశయము లేనిదే యిది ముంచివేయకలదు. ఈయవాంతరము తప్పినను మఱొక విపత్తుకలదు. పరిణామప్రేరణ స్తంభించి యంత్రప్రవృత్తమైన స్థిరసౌఖ్య సంఘజీవనము, యే ఆశయము లక్ష్యము

లేనిజీవనము, మఱొక పరిసమాప్తి కాగ లదు. జీవుడు మానవస్థితికి రాగానే యతని లోనుండు అధ్యాత్మికావశ్యకతయే పరిణామ ప్రేరణ యగుచున్నది. అది లేనిచో అతను వెనుకబడి అంతా మొదలెత్తుకొన వలెను. లేక యితర ప్రాణములవలె పరిణామప్రక్రియ విఫలమువలన అంతరించ వలెను......ప్రస్తుతము మానవజాతి తా నెన్నుకొనవలసిన విధిని దాచినట్టి పరిణామ సందిగ్ధతను యెదుర్కొనుచున్నది. వలన, మానవునిమనస్సు కొన్నివైపుల అత్యధిక వికాసమును జెందినది; యిత

రము లందు సంకుచితమై త్రోవగానక భ్రమజెందుచున్నది......విపుల దృష్టిగల మనస్సును, తాదాత్మ్యజ్ఞాన చైతన్యమును యింకను ముందుకురాలేదు...ప్రపంచ స్థితి యొండొంటి నెదుర్కొను మనోభావములును, వ్యష్టిసమష్టుల భౌతిక వాంఛ ప్రేరణలును, ప్రాణికకోర్కెలు హక్కులును, అజ్ఞాన జీవన ప్రోత్సాహములును, వ్యక్తుల, వర్గముల, జాతుల జీవనతృప్తికొఱకయిన పిపాసయును, మెండగు పుట్టగొగులవంటి రాజకీయ, సాంఘిక, ఆర్థిక, అభిప్రాయములును, యొకరినిచంపి తాము చంపబడు

టకు మానవులు దేనికొఱకు సిద్ధపడి యుం
దురో యా నినాదములును, లక్ష్యము
చేరుటకు అదే మార్గమను నమ్మకముతో
తమ స్వాధీనములోయున్న అపార భయం
కర సాధనముల నుపయోగించు యత్న
మును ఇవి కలసిన ప్రళయముగ నున్నది.
...సృష్టి హేతుకమును సమరసమొనర్చు
నట్టి అధ్యాత్మిక తేజాధీనము లోనికి రాని
యెడల వినష్టియే కాగలదు."

మఱియు "పునర్జన్మ యితరలోకము"
లను అధ్యాయమునందిట్లు వ్రాసినారు.
"పుట్టుకకు ముందుండినట్లు చచ్చిన తర్వా

తను మిగులునది అంతరాత్మ...సాధారణ
ముగ మనముకోరునది అలా మన మనస్సు
ప్రాణము శరీరములు కూడ నిలువవలె
నని; యుగయుగమున శరీరము చావకుండు
మార్గమును కనుగొను చేయుప్రయత్నము
యందుకు తార్కాణము. మనఃప్రాణ శరీ
రములు అంతరాత్మయొక్క అమృతత్త్వ
దైవత్వములవంటి దానిని పొందగలిగిననే
యీ యత్నము సాధ్యంబగు. బాహ్య
మనోమయపురుషుడు మరణానంతరము
యుండకల్గుటకు కొన్ని పరిస్థితులు కలవు.
అంతర్మనస్సు, అంతర్మనోమయ పురుషు

నితో నైక్యమగునంత శక్తివంతముగ బాహ్యమందు వ్యక్తిత్వమునొంది, అనంతము యొక్క పరివర్థమాన మగు వర్తనమున కుస్మీలనమయ్యేనేని, అభివృద్ధికిగాను పూర్వ మనస్సును పరిత్యజించి క్రొత్త దానిని నిర్మించ నవసరములేకపోయినచో, నియ్యది లభించును. ఇట్లే ప్రాణమయ పురుషుడుకూడా. అలా జరిగినప్పుడు అంతరాత్మకును బాహ్యజీవునికిని మధ్యగల తెర భిన్నమై నిత్యమగు చైత్యపురుషుని ప్రతినిధులగు కాయపు మనోమయ ప్రాణమయపురుషులు లోనుండి జీవమును

పూరించెదరు. అంత మన మనఃప్రాణ ప్రకృతుల విచ్ఛిన్నముగ, అప్పటికప్పుడు పుట్టినవి గాక, ఆత్మ నభివ్యక్తము చేయును. జన్మ నుండి జన్మకు క్షయముగాక నిల్చియుండు నవి యగు మన మనోమయ ప్రాణమయ పురుషులు. ఇదే అమృతత్త్వభావము. ఇది నిశ్చేతన భౌతిక ప్రకృతులపైని ఆత్మ యొక్క విపుల విజయ మగుచున్నది.

కాని, యీ నిలుకడ సూక్ష్మశరీరము నందే జరుగగలదు. పురుషుడు శరీరమును వదలి యితర లోకములనుచేరి తిరిగి క్రొత్త శరీరమును దాల్చవలెను. ప్రబో

ధము గాంచిన మనోమయ ప్రాణమయ పురుషులు సాధారణముగ విసర్జించబడు సూక్ష్మశరీర మందలి మనోమయ ప్రాణ మయ కోశములను నిల్పుకొని క్రొత్త శరీర మును ప్రవేశించి పూర్వమందుండి యిప్పుడును యికమీదను యుండుటచే నెల్లప్పుడున్నదను భావమును కల్గియుందు రు. భౌతికశరీరమీ మార్పువలన నిలువ బడనేరదు. ఏయుపాయముచేతనేని జరా మరణముల భౌతిక హేతువులను నిరోధించ కల్గితిమేని,* అంతరాత్మాభివృద్ధికి కావల

* వస్తుపరిజ్ఞానశాస్త్రము లేక రహస్య

సిన మార్పున కెడమిచ్చునంతటి మార్దవ
ముగల పరివర్ధమానమగు పట్టమును నడ
కయు కలదయ్యేనేని శరీరము నిలువ
కలదు...నిజమైన అమృతత్వము ఆత్మ
యొక్క నిత్యతయే యగుచున్నది. భౌతిక
శరీర నిలుకడ ఇచ్ఛతో నంతముకాగలది

జ్ఞానము ఇవి శరీరము నిరంతర ముండగల
సాధనోపాయములను కనుగొన్నను అంత
రాభివృద్ధిని వ్యక్తపఱచుటకు అనుగుణ్య
మైనదిగా కాలేకపోయినచో ఆత్మ దానిని
విసర్జించుటకు యేదోమార్గమును చూచు
కొని క్రొత్త అవతారమునకు చేరును.

యును భౌతిక పదార్థము, మరణము, వీని పయి ఆత్మయొక్క ఇహ సంబంధమగు విజయమును యగుచున్నది.

సృష్టివిధాన మిదియగుటచే, ప్రస్తుత ప్రపంచ పరిస్థితియును మానవ పరిణామావధి ఘట్ట మిట్టిదగుటచే, శరీరసిద్ధి లక్షణ మిట్టిదగుటవలన, శ్రీ త ల్లి గా రొ క చో నుడివినట్లు మానవుడింకను యున్మీలనము

భౌతిక శారీరిక నిమిత్తములే నిర్యాణమునకు ముఖ్యము లేక నిజమగు కా ర ణ ము లు గావు. క్రొత్తజీవుడు పరిణమించుట కొఱకగు నధ్యాత్మికావసర మే దాని నిజాంతరార్థము.

గాంచకపోవుటచే, నవతారమూర్తియైన శ్రీఅరవిందులు పుడమిపయి దివ్యజీవనను ప్రతిష్టించుటే సృష్టి లక్ష్యమనియు, దానిని సాధింపనోపినది పరమనస్సు—సత్యచేతన —యొక్కటే యనియు, ఈ విజ్ఞానావరోహణము భౌతికమందు తప్పనిసరిగ జరుగగలదు జరుగనున్నదనియు, పరమావధి యగు నీదివ్యజీవన అనుచరణయందు వ్యక్తి, సంఘ, జాతి, వీని యన్నింటియందు ఐక్యత, స్వేచ్ఛ, సమరసము, సౌందర్యము, ఆనందముల నెలకొల్పుటే యనియు, యియ్యది భౌతికమందే జరుగవలసినది కాన

శరీరము దివ్యసిద్ధి బడయువలెననియు, ఈ సిద్ధికి సూక్ష్మశరీరము దానియందుగల చక్రములతో అంతరాభివృద్ధిని జెంది అంతరాత్మాభి వ్యక్త్యోపకరణముగ మార్గవము అనువైనది యగుటయే విధియనియు, సూచించి, చివఱకు అమృతత్త్వము 'ఆత్మ నిత్యతయే యనియు' భౌతికశరీరము ఇచ్ఛతో నంతము కాగలదనియు తెల్పియుండుటచే, శ్రీవారి యుత్క్రమణ మందలి నిజాంతరార్థమును పర్యవసానమును తెలియనగు నొక్కింత.

సమాప్తము

# కే నో ప ని ష త్తు

## ప్రథమ ఖండము

కేనేషితం పతతిప్రేషితంమనః
కేనప్రాణఃప్రథమః ప్రైతియుక్తః ।
కేనేషితాం వాచమిమాంవదన్తి
చక్షుశ్శ్రోత్రం క ఉదేవో యునక్తి ॥

కేన ఈషితం పతతి మనః కేన ప్రాణః ప్రథమః ప్రైతి యుక్తః । కేన ఈషితాం వాచం ఇమాం వదన్తి చక్షుః శ్రోత్రం కః ఉ దేవః యునక్తి.

By whom missioned falls the mind shot to its mark? By whom yoked does the first life-breath move forward on its paths ? By whom impelled is this word that men speak ? What god set eye and ear to their workings.

ఎవని ప్రేరణమున తన లక్ష్యముపై ప్రయోగింపబడి మనస్సు పడుచున్నది ?

## ప్రథమ ఖండము

ఎవనిచే జోడింపబడి ప్రథమప్రాణ మద్దాని మార్గముల ముందుకు నడుచుచున్నది? మనుజులు వచించు ఈ వాక్కు ఎవనిచే ప్రేరితము? ఏ దేవుడు నేత్రమును చెవిని వాని పనులకు పూన్చు చున్నాడు? (1)

శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో
యద్వాచోహవాచం స ఉ ప్రాణస్య
ప్రాణః। చక్షుషశ్చక్షు రతిముచ్యధీరాః
ప్రేత్యాస్మాల్లోకా దమృతా భవన్తి॥

శ్రోత్రస్య శ్రోత్రం మనసః మనః

యత్ వాచః హ వాచం సః ఉ ప్రాణస్య
ప్రాణః చక్షుషః చక్షుః అతిముచ్య
ధీరాః ప్రేత్య అస్మాత్ లోకాత్
అమృతాః భవన్తి.

That which is hearing behind the hearing, mind of the mind, the word behind the speech, that too is life of the life-breath, sight behind the sight, the wise find their release beyond and passing forward from this world they become immortal.

ఏది వినికి వెనుకనుండు వినికియో, మనస్సుయొక్క మనస్సో, పలుకునకు

వెనుకనుండు వాక్కు, అదియే ప్రాణము యొక్క ప్రాణము, చూపు వెనుకనుండు చూపు, ధీమతులు ముక్తి నావలగాంచి ఈ లోకమునుండి ముందుకుజని అమరు లగుచున్నారు. (2)

నతత్ర చక్షుర్గచ్ఛతి నవాగ్గచ్ఛతి
నో మనో నవిద్మో న విజానీమో
యథైతదనుశిష్యాత్ । అన్య
దేవతద్విదితాదథో అవిదితాదధి,
ఇతిశుశ్రుమ పూర్వేషాం యేనస్త
ద్వ్యాచ చక్షిరే ॥

న తత్ర చక్షుః గచ్ఛతి న వాక్
గచ్ఛతి నో మనః న విద్మః న విజానీమః
యథా ఏతత్ అనుశిష్యాత్ అన్యత్
ఏవ తత్ విదితాత్ అథో అవిదితాత్
అధి ఇతి శుశ్రుమః పూర్వేషాం యే నః
తత్ వ్యాచ చక్షిరే.

There sight attains not, nor speech attains, nor the mind. We know not nor can we discern how one should teach of That; for it is other than the known, and it is above beyond the

unknown; so have we heard from the men of old who have declared That to our understanding.

అచ్చో దృష్టి పొఱ నేఱదు, వాక్కు చేఱనేఱదు, మనస్సు అందలేదు. దాని నెటుల బోధింపవలసినది మాకు తెలియదు మేము చింతింప జాలము. ఏలన, అది తెలిసిన దానికన్న వేరైనది, తెలియని దాని కావలను అతీతముగ నున్నది; దానిని మాబుద్ధికి తెలియబఱచిన పూర్వుల వలన ఆవిధముగ మేము విన్నాము. (3)

యద్వాచాఽనభ్యుదితం
యేనవాగభ్యుద్యతే।
తదేవ బ్రహ్మ త్వం విద్ధి
నేదం యదిద ముపాసతే ॥

యత్ వాచా అనభ్యుదితం యేన వాక్ అభ్యుద్యతే తత్ ఏవ బ్రహ్మ త్వం విద్ధి న ఇదం యత్ ఇదం ఉపాసతే.

That which remains unexpressed by the word, that by which the word is expressed, know that indeed to be the Brahman, not this which men follow after here.

ఏది వాక్కుచే వ్యక్తము కాకుండునో, దేనిచే వాక్కు వ్యక్తమగుచున్నదో, అదే బ్రహ్మమని ఎఱుంగుము, దేనిని మనుజులిక్కడ అనుసరించు (ఉపాసించు) చున్నారో ఇది కాదు. (4)

యన్మనసా నమనుతే
యేనాహుర్మనోమతం ।
తదేవ బ్రహ్మ త్వం విద్ధి
నేదంయదిదముపాసతే ॥

యత్ మనసా న మనుతే యేన
ఆహుః మనః మతం తత్ ఏవ బ్రహ్మ త్వం
విద్ధి న ఇదం యత్ ఇదం ఉపాసతే.

That which thinks not by the mind,* that by which the mind is thought, know That indeed to be the Brahman, not this which men follow after here.

ఏది మనస్సుచే చింతింపదో, *దేనివలన మనస్సు చింతనమగుచున్నదో అదే బ్రహ్మ

---

* or that which one thinks not with the mind

* దేనిని మనుజుడు మనస్సుతో చింతింపడో

మని ఎఱుంగుము. దేనిని మనుజులిక్కడ అనుసరించు (ఉపాసించు) చున్నారో ఇది కాదు. (5)

యచ్చక్షుషా నపశ్యతి
యేనచక్షూంషిపశ్యతి।
తదేవ బ్రహ్మ త్వం విద్ధి
నేదం యదిద ముపాసతే॥

యత్ చక్షుషా న పశ్యతి యేన చక్షూంషి పశ్యతి తత్ ఏవ బ్రహ్మ త్వం విద్ధి న ఇదం యత్ ఇదం ఉపాసతే.

That which sees not with the eye ‡ that by which one sees the eye's seeings, know That indeed to be the Brahman, not this which man follow after here.

ఏది కనులతోఁ చూడదో ‡ ఒకడు దేని వలన కనులచూపులను చూచుచున్నాడో, అదే బ్రహ్మమని ఎఱుంగుము. దేనిని మనుజులిక్కడ అనుసరించు (ఉపాసించు) -చున్నారో ఇది కాదు. (6)

---

‡ that which one Sees not wiih the eye

‡ దేనిని మనుజుడు కనులతోఁ చూడడో

యచ్ఛ్రోత్రేణ నశృణోతి
యేనశ్రోత్రమిదం శ్రుతం।
తదేవబ్రహ్మత్వంవిద్ధి
నేదం యదిద ముపాసతే॥

యత్ శ్రోత్రేణ న శృణోతి యేన శ్రోత్రం ఇదం శ్రుతం తత్ ఏవ బ్రహ్మ త్వం విద్ధి న ఇదం యత్ ఇదం ఉపాసతే.

That which hears not with the ear § that by which hearing is heard,

§ that which one hears not with the ear

know That to be the Brahman, not this which men follow after here.

ఏది చెవితో వినదో ? దేనివలన వినికి వినబడునో, అది బ్రహ్మమని ఎఱుంగుము. దేనిని మనుజులిక్కడ అనుసరించు (ఉపాసించు) చున్నారో ఇది కాదు. (7)

యత్ప్రాణే నప్రాణితి
యేన ప్రాణః ప్రణీయతే ।
తదేవ బ్రహ్మత్వం విద్ధి
నేదం యదిద ముపాసతే ॥

---

దేనిని మనుజుడు చెవితో వినడో

యత్ ప్రాణేన న ప్రాణితి యేన
ప్రాణః ప్రణీయతే తత్ ఏవ బ్రహ్మ
త్వం విద్ధి న ఇదం యత్ ఇదం ఉపాసతే.

That which breathes not with the breath, *** that by which life-breath is led forward in its paths, know that indeed to be the Brahman, not this which men follow after here.

ఏది శ్వాసముతో ఊపిరిసల్పదో
(ప్రాణముచే ప్రాణవంతముకాదో,)

*** that which one breathes not - i.e. smells not - with the breath

**దేనివలన ప్రాణవాయు వర్ధాని మార్గ
ముల ముందుకు నడుపబడుచున్నదో, అదే
బ్రహ్మమని ఎఱుంగుము, దేనిని మనుజు
లిక్కడ అనుసరించు (ఉపాసించు)
చున్నారో ఇది కాదు. (8)

---

**మనుజుడే శ్వాసముతో ఊపిరిసల్పడో-
ఆఘ్రాణించడో—



# ద్వితీయ ఖండము

యదిమన్యసే సువేదేతి దభ్రమేవాపి
నూనం త్వం వేత్థబ్రహ్మణోరూపం
యదస్యత్వం యదస్యదేవే ష్వథను
మీమాంస్యమేవ తే మన్యే విదితమ్॥

యది మన్యసే సువేద ఇతి దభ్రం ఏవ
అపి నూనం త్వం వేద్థ బ్రహ్మణాః రూపం

యత్ అస్య త్వం యత్ అస్య దేవేషు
అధను మీమాంస్యం ఏవ తే మన్యే
విదితమ్.

If thou thinkest that thou knowest It well, little indeed dost thou know the form of the Brahman. That of it which is thou, that of it which is in the gods this thou hast to think out. I think it known.

దానిని నీవు బాగా తెలిసికొన్నానని
నీ వనుకొన్నచో, నీవు తెలిసికొనినది నిజ

ముగ అతిస్వల్పమగు బ్రహ్మరూపము. దానిలో నెద్దినీవో, దానిలో నెద్ది దేవతలలోనున్నదో, దీనిని నీవు చింతింపవలెను. నేనది తెలిసినదిగ తలంచుచున్నాను. ( 1 )

నాహం మన్యే సువేదేతి నోన వేదేతి
వేదచ।
యోనస్తద్వేద తద్వేద నోన వేదేతి
వేదచ॥

న అహం మన్యే సు వేద ఇతి వేద చ యః తత్ వేద తత్ వేద నో న వేద ఇతి వేద చ.

I think not that I know It well and yet I know that It is not unknown to me He of us who knows it, knows that; He knows that It is not unknown to him.

నాకది బాగా తెలియునని నేనుతలంచను అయినను నాకది తెలియనిది కాదని నాకు తెలియును. మనలో నెవడిది తెలిసికొనునో దాని నెఱుగును; తనకది తెలియనిది కాదని అత డెఱుంగును. ( 2 )

యస్యామతం తస్యమతం
మతంయస్య న వేదసః ।
అవిజ్ఞాతం విజానతాం
విజ్ఞాత మవిజానతాం ॥

యస్య అమతం తస్య మతం మతం యస్య న వేద సః అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాతం అవిజానతాం.

He by whom It is not thought out, has the thought of It; he by whom It is thought out, knows It not. It is

unknown to the discernment of those who discern of It, by those who seek not to discern of It, It is discerned.

ఎవనిచే నది చింతింపబడలేదో దాని చింతన మతనికిగలదు ; ఎవనిచే నది చింతింప బడునో దాని నతడెఱుగడు. దానినిగూర్చి విచారము చేయువారి వివేక మున కది తెలియని దగుచున్నది, దానిని గూర్చి విచారముచేయ నొల్లనివారిచే నది వివేకింప బడుచున్నది. (3)

ప్రతిబోధ విదితం మత
మమృతత్వం హి విన్దతే ।
ఆత్మనా విన్దతే వీర్యం
విద్యయా విన్దతేఽమృతమ్ ॥

ప్రతిబోధవిదితం మతం అమృతత్వం హి విన్దతే ఆత్మనా విన్దతే వీర్యం విద్యయా విన్దతే అమృతమ్.

When it is known by perception that reflects it, then one has the thought of

it, for one finds immotatily; by the self one finds the force to attain and by knowledge one finds immortality.

దానిని ప్రతిబింబించు ప్రబోధముచే నది తెలిసికొన బడినపుడంత యొకడు దాని చింతనము గల్గియున్నాడు, ఏలన అతడు అమృతత్వము కాంచు చున్నాడు ; ఆత్మ వలన ప్రాప్తి నొందుటకు శక్తిని కాంచు చున్నాడు జ్ఞానముచే నమృతత్వమును బడయునొకడు. ( 4 )

## ద్వితీయ ఖండము

ఇహచేదవేదీ దథ సత్యమస్తి
నచేదిహా వేదీన్మహతీ వినష్టిః ।
భూతేషు భూతేషు విచిన్త్య ధీరాః
ప్రేత్యాస్మాల్లోకా దమృతా భవన్తి ॥

ఇహ చేత్ అవేదీత్ అథ సత్యం అస్తి న చేత్ ఇహ అవేదీత్ మహతీ వినష్టిః భూతేషు భూతేషు విచిన్త్య ధీరాః ప్రేత్య అస్మాత్ లోకాత్ అమృతాః భవన్తి.

If here one comes to that knowledge then one truely is, if here one comes not to the knowledge, then great is the perdition. The wise distinguish that in all kinds of beings and they pass forward from this world and become immortal.

ఇక్కడ ఒకడాజ్ఞానమును చెంది నట్లయిన ఒకడంత యదార్థము గ నున్నాడు. ఇక్కడ ఒకడాజ్ఞానమును చెందనట్లయిన వినాశము మహత్తరమైన దగునంత. ధీమతలు భూతములన్నిటి నుండి

దానిని వివేకించి ఈ లోకము నుండి ముందుకుజని అమరులగుచున్నారు. (5)



# తృతీయ ఖండము

బ్రహ్మహ దేవేభ్యో విజిగ్యే తస్యహ
బ్రహ్మణో విజయే దేవా అమహీయన్త
తఐక్షన్తా స్మాకమేవాయం విజ
యోఽస్మాక మేవాయం మహిమేతి ॥

బ్రహ్మ హ దేవేభ్యః విజిగ్యే తస్య
హ బ్రహ్మణః విజయే దేవాః అమహీ

యస్త తే ఐక్షన్త అస్మాకం ఏవ అయం విజయః అస్మాకం ఏవ అయం మహిమా ఇతి.

The Eternal conquered for the gods and in that victory of the Eternal gods came to greatness. This was what they saw, "ours is this victory, ours is this greatness."

నిత్యుడు (బ్రహ్మ) దేవతలకుగాను జయించెను. ఆ నిత్యుని (బ్రహ్మ) విజయము

నందు దేవతలు మహాత్వము గాంచిరి. వారు చూచిన దిది 'మాది ఈ విజయము మాది ఈమహాత్వము' (1)

తద్ధైషాం విజజ్ఞౌ తేభ్యోహ ప్రాదుర్బ
భూవ
తన్నవ్య జానన్త కిమిదం యక్షమితి॥

తత్ హ ఏషాం విజజ్ఞౌ తేభ్యః హ ప్రాదుర్బభూవ తత్ న వ్యజానన్త కిం ఇదం యక్షం ఇతి.

That marked this thought of theirs; to them That became manifest. They could not discern of that, what was this mighty Daemon ?

వారి యీ తలంపునది గుర్తించినది (తెలిసికొనినది); వారికది ప్రత్యక్షమాయెను. వారు దానిని వివేకింప జాలరైరి, ఇది ఏ మద్భూతమో? (ఈయక్షమేమిటో)? (2)

తేఽగ్ని మబ్రువన్ జాతవేద ఏతద్వి
జానీహి కిమేతద్యక్షమితి తథేతి।

తే అగ్నిః అబ్రువన్ జాతవేదః ఏతత్
విజానీహి కిం ఏతత్ యక్షం ఇతి తథా ఇతి.

They said to Agni "O knower of all Births, this discern, what is this mighty Daemon" He said, "So be it."

వారు అగ్నితోననిరి "ఓఎల్లపుట్టుకల
నెఱిగినవాడా, దీనిని తెలిసికొనుము, ఇది
ఏ మహద్భూతమో (ఈయక్షమేమిటో)
అతడనెను, "అలాగేయగుగాక." (3)

తదభ్య ద్రవ త్తమభ్యవదత్కో సీతి
అగ్నిర్వా
అహమస్మీ త్యబ్రవీజ్జాత వేదావా
అహమస్మీతి॥

తత్ అభ్యద్రవత్ తం అభ్యవదత్
కః అసి ఇతి అగ్నిః వా అహం అస్మి ఇతి.
అబ్రవీత్ జాత వేదాః వా. అహం అస్మి
ఇతి.

He rushed upon that; It said to him, "Who art thou." "I am Agni, he said "and I am the Knower of all Births."

దానిపై కతడురికెను; అతని కది చెప్పెను 'నీ వెవరు?'. 'నే నగ్నిని, ఎల్లపుట్టుకల నెఱింగిన వాడను (జాత వేదుడను)' అనె నతడు. (4)

తస్మిన్ స్త్వయి కింవీర్య మిత్యసీదగ్ం
సర్వం
దహేయం యదిదం పృథివ్యామితి ॥

తస్మిన్ త్వయి కిం వీర్యం ఇతి అసి ఇదం సర్వం దహేయం యత్ ఇదం పృథివ్యాం ఇతి.

'Since such thou art, what is the force in thee?" "Even all this I can burn, all this that is upon the earth."

" అట్టిది నీవగుటచే, నీయందలి శక్తి యెయ్యది ? " " ఇదంతయును దహింపగలను, పృథివి యందుండు ఇదంతయు " (౫)

తస్మై తృణం నిదధా వేతద్దహేతి
తదుపప్రేయాయ సర్వజవేన
తన్నశశాక దగ్ధుం సతత ఏవ నివవృతే
నైతదశకం విజ్ఞాతుం యదేతద్య
క్షమితి ॥

తస్మై తృణం నిదధౌ ఏతత్ దహ
ఇతి తత్ ఉపప్రేయాయ సర్వజవేన తత్
న శశాక దగ్ధుం సః తతః ఏవ నివవృతే
న ఏతత్ అశకం విజ్ఞాతుం యత్ ఏతత్
యక్షం ఇతి.

That set before him a blade of grass; "This burn." He went to it with all his speed and he could not burn it. Even there he ceased, even thence he returned; "I could not discern of That, what is this mighty Daemon."

అది అతనిముందొక గడ్డిపోచ నుంచె: "దీనిని దహించు." అతడు దానిపైకి తన సర్వజవముతో వెళ్లెను దాని నతడు దహింపలేక పోయెను. అక్కడనే అతడు నిలిచిపోయెను, అక్కడనుండే అతడు మరలిపోయెను; "నేను దానిని తెలిసికొన లేకపోతిని, ఇది ఏ మహాత్మ్య తేనా (ఈయక్షమేమిటో)" (6)

అథవాయు మబ్రువన్ వాయవే।
తద్విజానీహి కిమే తద్య క్షమితి తథేతి

అథ వాయుం అబ్రువన్ వాయో ఏతత్ విజానీహి కిం ఏతత్ యక్షం ఇతి తథా ఇతి.

Then they said to Vayu, "O Vayu, this discern, what is this mighty Daemon." He said, "So be it."

వారు వాయువుతో ననిరి, "ఓ వాయూ, దీనిని తెలిసికొనుము, ఇది ఏ మహద్భూతమో (ఈ యక్షమేమిటో)" "అలాగే యగుగాక" అనె నతడు. (7)

తదభ్యద్రవత్తమభ్యవదత్కోఽసీ
తివాయుర్వా అహమస్మీ
త్యబ్రవీన్మాతరిశ్వావా అహమస్మీతి ।

తత్ అభ్యద్రవత్ తం అభ్యవదత్ కః అసి ఇతి. వాయుః వా అహం అస్మి ఇతి అబ్రవీత్ మాతరిశ్వా వా అహం అస్మి ఇతి.

He rushed upon That, It said to him, "Who art thou?" "I am Vayu," he said, "and I am he that expands in the Mother of things."

దానిపైకత డురికె, అతనికది చెప్పెను,
"నీ వెవరు ?" "నే వాయువును" అనె
నతడు, "విషయముల మాతయందు
విస్తరించు నతడు నేను" (8)

తస్మిన్ స్త్వయికిం వీర్యమిత్య పీదగ్
సర్వమాదదీయం
యదిదం పృథివ్యా మితి ॥

తస్మిన్ త్వయి కిం వీర్యం ఇతి అపి ఇదం సర్వం ఆదదీయం యత్ ఇదం పృథివ్యాం ఇతి.

"Since such thou art, what is the force in thee?" "Even all this I can take for myself, all this that is upon the earth."

" అట్టిది నీవగుటచే, నీయందలిశక్తి యెయ్యది " " ఇదంతయును నేను నాకై తీసికొనగలను, పృథివియందుండు ఇదంతయు." (9)

తస్మైతృణం నిదధా వేతదా ధత్స్వేతి
తదుపప్రేయాయ
సర్వజవేన తన్నశశా కాదాతుం సతత ఏవ
నివవృతే
నైతదశకం విజ్ఞాతుం యదే తద్యక్షమితి॥

తస్మై తృణం నిదధౌ ఏతత్
ఆధత్స్వ ఇతి తత్ ఉపప్రేయాయ
సర్వజవేన తత్ న శశాక ఆదాతుం
సః తతః ఏవ నివవృతే న ఏతత్ అశకం
విజ్ఞాతుం యత్ ఏతత్ యక్షం ఇతి.

That set before him a blade of grass; "This take." He went towards it with all his speed and he could not take it. Even there he ceased, even thence he returned; "I could not discern of That, what is this mighty Daemon."

అది అతనిముందాక గడ్డిపోచనుంచె;
"దీనిని తీసికొనుము" అతడు దానివైపు
తన సర్వజవముతో వెళ్లెను అతడుదానిని
తీసికొనలేక పోయెను. అక్కడనే అతడు
నిలిచిపోయెను, అక్కడనుండే అతడు
మరలిపోయెను "నేను దానిని తెలిసి
కొనలేక పోతిని. ఇది ఏ మహాద్భూతమో
(ఈ యక్షమేమిటో)" (10)

అథేన్ద్ర మబ్రువన్మఘ వన్నేతద్వి
జానీహి కిమే తద్యక్షమితి
తథేతి తదభ్యద్రవత్ తస్మాత్తిరోదధే।

అథ ఇన్ద్రం అబ్రువన్ ఏతత్ విజానీహి కిం ఏతత్ యక్షం ఇతి తథా ఇతి అభ్యద్రవత్ తస్మాత్ తిరోదధే.

Then they said to Indra, "Master of plenitude, get thou the knowledge, what is this mighty Daemon." He said, "So be it" He rushed upon That, That vanished from before him.

అంత వా రింద్రునితోననిరి "మహాదాధిపా, (మఘవంతుడా) నీవు తెలిసికొనుము, ఇది ఏ మహద్భూతమో

(ఈ యక్షుయమేమిటో)." అతడనెను, "అలాగేయగుగాక." దానిపై కతడుఱి కెను, అదతని ఎదుటనుండి తిరోహిత మయ్యెను. (11)

సతస్మిన్నే వాకాశే స్త్రియ
మాజగామ బహు శోభామానా
ముమాం హైమతీం తాగ్
హోవాంచ - కిమే తద్యక్ష మితి ।

సః తస్మిన్ ఏవ ఆకాశే స్త్రియం అజగామ బహు శోభమానాం ఉమాం

హైమవతీం తాం హ ఉవాచ కిం ఏతత్ యక్షం ఇతి.

He in the same ether came upon the woman, even upon Her who shines out in many forms, Uma daughter of snow summits. To her he said, "What was this Mighty Daemon?"

అతడాకాశమునందే స్త్రీని బహు రూపములతో శోభిల్లు ఉమాదేవినే హిమవత్పర్వత పుత్రిని తారసిల్లెను. ఆమెతో నతడనె "ఇది ఏ మహాద్భుతమో (ఈ యక్షమేమిటో)?" (12)

# చతుర్థ ఖండము

సాబ్రహ్మేతిహోవాచ బ్రహ్మణోవా
ఏతద్విజయే మహీ యధ్వమితి
తతోహైవ విదాఞ్చకార బ్రహ్మేతి॥

సా బ్రహ్మ ఇతి హ ఉవాచ బ్రహ్మణః
హ ఏతత్ విజయే మహీయధ్వం ఇతి
తతః హ ఏవ విదాఞ్చకార బ్రహ్మ ఇతి.

She said to him "It is the Eternal. Of the Eternal is the victory in which ye shall grow to greatness." Then alone he came to know that this was the Brahman.

ఆమె చెప్పిన దాతనికి, "అది శాశ్వతుడు ( బ్రహ్మము ). దేనివలన మీరు మహత్వమందు వృద్ధిజెందగలరో ఆ విజయము శాశ్వతునిది (బ్రహ్మది)." అంతనే యతడిది బ్రహ్మమని తెలిసికొనగలైను.( 1 )

## చతుర్థ ఖండము

తస్మాద్వా ఏతేదేవా అతితరామి
వాన్యాన్ దేవాన్ యదగ్నివాయు
రిన్ద్రస్తే హ్యేనన్నే దిష్టం
పస్పృశుస్తే............

తస్మాత్ వా ఏతే దేవాః అతితరాం
ఇవ అన్యాన్ దేవాన్ యత్
అగ్నిః వాయుః ఇన్ద్రః! తే హి
ఏనత్ నేదిష్టం పస్పృశుః......

Therefore are these gods as it were beyond all the other gods, even Agni and

Vayu and Indra because they come nearest to the touch of That.......

కావున ఈ దేవత లితర దేవతలందరి కన్న అతీతులుగనున్నారు, అగ్ని వాయు ఇంద్రుడున్నూ, ఏలన వారు దానిస్పర్శకు అతి సమీపముగ వచ్చిరి.*.......*(2)

---

* ఆదియందు వర్ణించినవారి పొరపాటు వలననో లేక ఈ వరి వ్రాతప్రతుల యందలి తప్పువలననో ఈ మంత్రమందలి

తస్మాద్వా ఇన్ద్రో౽తితరామివాన్యాన్ దేవాన్
స హ్యేనన్నేదిష్ఠం పస్పర్శ స హ్యేనత్ప్రథమో
విదాఞ్చకార బ్రహ్మేతి ॥

---

మిగత భాగముఅతిభ్రష్టు పట్టినది. అదీరీతి నున్నది. " They he first came to know that it was the Brahman" "వారు అతడు అది బ్రహ్మమని తెలిసికొన మొదటవచ్చినది." ఇది వాస్తవ విషయంకాదు- భావముకాదు- వ్యాకరణము

తస్మాత్ వా ఇంద్రః అతితరాం ఇవ అన్యాన్ దేవాన్ సః హి ఏనత్ నేదిష్ఠం పస్పర్శ సః హి ఏనత్ ప్రథమో విదాఞ్చకార బ్రహ్మ ఇతి.

Therefore is Indra as it were beyond all the other gods because he came nearest to the touch of That, because he first knew that It was the Brahman.

---

కాదు. మూడవమంత్రముయొక్క చివరి భాగము దీనిలో ప్రవేసించి రెండవ మంత్రముయొక్క అసలు చివరభాగమును లుప్తపఱచినది.

కావున ఇంద్రుడితర దేవతలందరికన్న అతీతుడయినట్లున్నాడు ఏలన దాని స్పర్శకు అత్యధిక సన్నిహితముగ అతడు వచ్చెను, మఱియు నది బ్రహ్మమని ముందుగా నతడు తెలిసికొనెను. (3)

తస్యైష ఆదేశో యదే తద్విద్యుతో
వ్యద్యుతదా౩ ఈన్న్య
మీమిషదా ఇత్యధి దైవతమ్ ॥

తస్య ఏషః ఆదేశః యత్ ఏతత్ విద్యుతః వ్యద్యు తత్ ఆ ఇతీ న్యమీమి షత్ ఆ ఇతి అధి దైవతమ్.

Now this is the indication of That,— as is this flash of lightning upon us or, as is this falling of the cyelid, so in that which is of the gods.

దానియొక్క సూచన ఇప్పుడిది,— మనపై మెఱపు మేఱసినట్లు, లేదా ఈ రెప్పపాటువలె, దేవతలదైన (అధిదైవతమైన) దెద్దియో దానియందింతే. (4)

## చతుర్థ ఖండము

అథాధ్యాత్మం యదే తద్గచ్ఛతీవచ
మనోఽనేన చైతదుపస్మర
త్యభీక్ష్ణం సఙ్కల్పః ॥

అథ అధ్యాత్మం యత్ ఏతత్
గచ్ఛతి ఇవ చ మనః అనేన చ ఏతత్
ఉపస్మరతి అభీక్ష్ణం, సఙ్కల్పః.

Then in that which is of the Self—as the motion of this mind seems to attain to That and by it afterwards the will in the thought continully remembers it.

ఇక ఆత్మదైన దేద్దియో దాని యందు— ఈ మనస్సుయొక్క వ్యాపారము దానిని చెందినదని కనుపడినట్లు, మరియు దానివలన తర్వాతచింతనమందలి ఇచ్ఛ దానిని సదా జ్ఞాపక ముంచుకొను నటుల. (5)

తద్ధతద్వనం నామ తద్వన మిత్యుపాసి
తవ్యం స య ఏతదేవం వేదాభి
హైనం సర్వాణిభూతాని
సంవాఞ్ఛన్తి ॥

చతుర్థ ఖండము

తత్ హ తద్వనం నామ తద్వనం ఇతి ఉపాసితవ్యం సః యః ఏతత్ ఏవం వేద అభి హ ఏనం సర్వాణి భూతాని సంవాఞ్ఛన్తి.

The name of That is 'That Delight;' as That Delight one should follow after it. He who so knows That, towards him verily all existences yearn.

'ఆ ఆనందమని' దాని నామము; అది ఆనందమని మనుజుడు దానిని వెంబడించ

వలెను (ఉపాసింపవలెను), దాని నాలా గెఱిగినవానిని సర్వభూతములు నిజముగా వాంఛించు చున్నవి. (6)

ఉపనిషదం భోబ్రూహీ త్యుక్తాత
ఉపనిషద్బ్రాహ్మీం వావత
ఉపనిషద మబ్రూమేతి ॥

ఉపనిషదం భో బ్రూహి ఇతి ఉక్తా తే ఉపనిషత్ బ్రాహ్మీం వావ తే ఉపనిషదం అబ్రూమ ఇతి.

Thou hast said "speak to me Upainshad"* spoken to thee is Upanishad. Of the Eternal verily is the Upanishad that we have spoken.

"నాకు ఉపపత్తు చెప్పుము"* నీ వంటివి- నీకు ఉపనిషత్తు చెప్పబడినది.

---

*Upanishad means inner knowledge, that which enters into the final Truth and settles in it.

* ఉపనిషత్తనగా అంతర్ జ్ఞానము, ఎయ్యది తుదిసత్యమందు ప్రవేసించి దానియందు స్థిరపడుచున్నదో అది.

శాశ్వతుని (బ్రహ్మను) గూర్చి నది వాస్తవముగా మేము చెప్పిన ఉపనిషత్తు.

(7)

తస్యైతపోదమః కర్మేతి ప్రతిష్ఠా
వేదా స్సర్వాఙ్గాని
సత్యమాయతనం ॥

తస్యై తపః దమః కర్మ ఇతి ప్రతిష్ఠా వేదాః సర్వాఙ్గాని సత్యం ఆయతనం.

Of this kuowledge austerity and self conquest and works are the foundation, the Vedas are its limbs, truth is its dwelling place.

ఈ జ్ఞానమునకు తపస్సు (అంతరేంద్రియ నిగ్రహము,) ఆత్మ నిగ్రహము, కర్మములు పునాదులు, వేదములు దాని అంగములు, సత్యము దానియునికిపట్టు.(8)

యోవా ఏతామేనం వేదా
పహత్య పాప్మానమనన్తే
స్వర్గేలోకే జ్యేయే ప్రతితిష్ఠతి
ప్రతితిష్ఠతి ॥

యః వా ఏతాం ఏవం వేద
అపహత్య పాప్మానం అనన్తే స్వర్గే లోకే
జ్యేయే ప్రతితిష్ఠతి ప్రతితిష్ఠతి.

He who knows this knowledge, smites evil away from him and in that vaster world and infinite heaven finds his foundation, yea he finds his foundation.

(ఈ తీరున) ఈ జ్ఞానము నెవడెఱుగు చున్నాడో తననుండి పాపమును హంత

మొనర్చు ఆ విశాలతర లోకములో అనంత
స్వర్గములో స్థిరస్థాయి యగుచున్నాడు-
స్థిరస్థాయి యగుచున్నాడు గదా! (9)





63
303
366